క. 'అకృతాస్త్రుఁడ నగు నాకుం
బ్రకటభుజాబలు లస్త్రపారీణులునై
సకల సుర నికర సంబా
ధకు లగుదానవుల గెలువఁ దరమే ?-యనుడున్; ౨౦౦

తే. 'అంబికానాథుఁ డిట్లను నతనితోడఁ-
దలఁపు పీడెన నిలిపెద, దానఁజేసి
పగఱ నిర్జింప నగుఁ. బదంపడి మనోర
థంబు సిద్ధించు, నరుగుము దడయ కనఘ. ౨౦౧

చ. 'అనవుడు-నట్ల కాక-యని, యాజమదగ్నిసుతుండు ధీరతం
జని, సముదగ్రులైన సురశత్రులఁ దీవ్రతరాయుధోత్కరం
బున వధియించి, వారి బలుపోటుల నొచ్చిన మేనితోడ వ
చ్చినఁ బురవైరి నిర్వ్రణునిఁ జేసెఁ, గరంబున నంటి యాతనిన్. ౨౦౨

వ. 'ఇవ్విధంబునం బ్రదీప్తశరీరుం గావించి భర్గుం డాభార్గవునయిం బ్రీతిశీతలంబగు నాలోకం బొలయ, నాతని కిట్లనియె— ౨౦౩

క. 'అనివర్తనమతిఁ గనయఁగ
నని పీదగు తనవు సునిశితాయుధములు దాఁ
కిన నొప్పదు. శత్రులు న
న్నిన నదుపుము గర్వ మడఁచి నిర్మలచరితా. ౨౦౪

వ. 'కావున వరప్రతిగ్రహంబునకు నిదియ సమయంబు, ౨౦౫

క. కోరు-మని, దివ్యం బగున
స్త్రనికాయము శస్త్రచయము దద్దయు దయ ని
చ్చిన; నని యాతఁడు సాష్టాంగ
నమస్కారంబు చేసి కైకొనియె నృపా. ౨౦౬

వ. 'తదనంతరంబ లోకగురుండగు నాహరునిచేత ననుజ్ఞాతుండై, యతండు నిజస్థానంబునకుం జనియె; నయ్యితిహాసప్రకారం బిట్టిది. యివ్విధంబున వివిధ దుష్కర సత్కర్మానుష్ఠానఫలంబులై వచ్చిన సర్వ[1]దివ్యాస్త్రంబులు నా రాముండు రాధేయునకుఁ బ్రీతచేతస్కుండై యొసంగె. నట్టి మహాత్ములు హీనకులజాతుల

1. విద్యాస్త్రంబులు.

వాదరింతురే? యప్పుణ్యపురుషుండు గయికొనుటఁ గర్ణుం డుత్కృష్టయోవిజాతుం డని తలంచెద. వదన వక్షో బాహు ప్రముఖాంగంబులు సూడ. దేవకుమారుండుం బోలె నున్నవాఁడు. ప్రకృతికాంత కాంచన కుండల వజ్రకవచంబులతోడ నాదిత్య సన్నిభుం డగు కొడుకుం గాంచునే? సింగంబు లేడి కెల్లు పుట్టు? వితవికి సూత సంవర్ధితుండైన కీడు దొడరె. వింతియ కానోపు. రుద్రశిష్యత్వంబున విశ్రుతుం డగు భార్గవరామునకుఁ బ్రియశిష్యుం డగు నంగరాజు, ననంగదమనుం బరిగ్రహిం చిన విరించిభంగిఁ బరిగ్రహించి నీవు సారథ్యం బాచరింపు. సకలగుణంబులను సారథి రథికున కధికుండు గావలయునను నీతి కలదు; నీవు ప్రసన్నుండ వగుటం జేసి నాకోర్కె సిద్ధించె. ననుటయు; ౩౦౮

తే. క్రుచ్చి మద్రవిభుండు నీకొడుకుఁ గౌఁగి
లించి ప్రియ మానసమునఁ దలిర్ప 'నృప కు
మార' నీవు నాకొలఁది యిట్లరయ నెఱుఁగు
దేని యది సెప్పు. నీకోర్కి యేను దీర్తు. ౩౦౯

వ. అని మఱియును. ౩౧౦

—॥ శల్యుఁడు కర్ణునకు సారథ్యము చేయ నొడంబడుట ॥—

క. నీనులకుం బలుకులు నేఁ
డైనను జెప్పుదు హితంబు లగు వాక్యంబుల్,
దానికి నోర్వఁగ వలయుం
గావి, యలుక వలదు నీకుఁ గర్ణున కధిపా.' ౩౧౧

ఆ. అవినఁ, గర్ణుఁ డిట్టు లను మద్రపతితోడ:—
'హరున కజుఁడు. నరున కచ్యుతుండుఁ
బోలె హితుఁడ వగుము బుద్ధిపరాక్రమ
శాలి, నాకు నీవు సంగరమున.' ౩౧౨

వ. అనవుడు, నట్ల కాక యని, శల్యుండు వెండియు— ౩౧౩

క. 'తగువార లొరుల దెగడుట
పొగడుట యగు పలుకుపొంతఁ బోవరు; హితకా
ర్యగతుల సెప్పఁగఁ దెగ దగుఁ
బొగ దగు, నెదు రోర్వవలయు బుద్ధిగలిగినన్. ౩౧౪

తే. 'శక్రుతేరైన నడపఁగఁ జాలువాఁడు,
[1]నుఱువు సెప్పుదు రథికు నేమఱుఁగనీను,
గృష్ణసారథ్యమునఁ దగు క్రీడి గెలువఁ
దలఁచు నీ కేను గడపుట దగు రథంబు.' ౩౧౪

చ. అన విని, భూవిభుండు ప్రియ మారఁగఁ గర్ణునిఁ జూచి: 'దేవకీ
తనయుఁడు మద్రనాథునకుఁ దక్కువ, మాతలియుం దలంప నీ
తని కెన రాఁడు; భాగ్యముకతంబున సారథి యయ్యె నీకు, నీ
యునఁ గొని నీవు పార్థుని యహంకృతి మాన్పుము ధీరమానసా.' ౩౧౫

క. అని యతఁడు శల్యుఁ గనుఁగొని
వినతుం డై:—'నీవు లావు వెఱవును మెఱయం
దనుఁ గావ, సంగపతి య
ర్జునుఁ గలన జయించువాఁడు రూఢిగ' ననుడున్; ౩౧౬

వ. అట్లయ్యెడుం గాక యని పలికి, మద్రేశ్వరుండు సారథ్యంబున కనురూపం బగు సన్నాహంబు ననుత్సాహంబు వాటించినం, బ్రీతుం డగుచు, సూతనందనుండు దనసూతు నాలోకించి, తగురథంబునకుం గల్పన యొనర్పుమని సత్వరంబుగాఁ బనిచిన, వాఁడును రయంబున దృఢసుందరం బగు స్యందనంబు సుకల్పితంబు సేసి తెచ్చి, దీవించియిచ్చిన, నయ్యరదంబుఁ బూజింపఁ బురోహితు నియమించి, తదీయ మంగళవిధానానంతరంబ తాను నర్చించి, కృతప్రదక్షిణుం డై ప్రణమిల్లి, భాస్కరోపస్థానం బాచరించి, సవినయంబున శల్యు నారోహణంబు సేయు మనుటయు, నతం డచల తటంబునకు లంఘించు సింగంబుచందంబున నొగ లెక్కిన;

ఆ. మెఱుఁగు తోడి లలితమేఘంబుమీఁదికిఁ
బోయి వెలుఁగుభానుపోలుపు దోఁప,
మద్ర రాజసహిత మహితమై యొప్పు న
త్తేరు కర్ణుఁ డెక్కి తేజరిల్లె. ౩౧౭

వ. అని యిట్లు కర్ణసారథిత్వంబునకు శల్యుండు మెయికొనుట, సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నవిన విని, యటమీఁది వృత్తాంతం బెఱిఁగింపు మనుటయు.

1. నొఱవు.

వ. అవిరళ దర్శన స్థిత మహాముని మానస వాసఖేలనో
త్సవ రసికా, రసాత్మక, వితాంత కృపాకర దివ్యచిత్త స
త్త్వ విభవ సంభృతైక్య సుఖతామయదేహ, నిరామయా, పున
ర్భవ పరిహార హారి పదపద్మయుగ, స్తవహృద్య సంస్తవా! 3.20

క. కమలవన సదృశ దృగ్రుచి
సముదయ శమితార్తిభక్త సంఘా, లక్ష్మీ
రమణత్వ శివాప్రియతా
సమవాయా[1]లంబ్యమాన సౌందర్యనిధీ! 3.21

మాలిని. అనుభవ శమరమ్యా, హంసభావైక గమ్యా,
విన మదఘువిదారీ, విశ్వలోకోపకారీ,
దినకరశశినేత్రా దీపరిస్పందచిత్రా,
దనుజ మథనలీలా, ధర్మ తత్త్వానుకూలా! 3.22

గద్యము

ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం
బయిన శ్రీ భారతంబున కర్ణపర్వంబు
నందుఁ బ్రథమాశ్వాసము.

1. యాలంబమాన.

ఓం

హరిహరనాథాయనమః

# తిక్కన భారతము:

# కర్ణపర్వము

## ప్రథమాశ్వాసము


శ్రీపరిణామస్థితి వి
ద్యాపారీణత్వకారితా విరతా పాం
గా, పరమ నైష్ఠికత్వ
వ్యాపారపరానుషక్త హరిహరనాథా! ౧

— సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ గర్ణుని వీరమరణమును జెప్పుట —

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె :- అట్లు మహాప్రాజ్ఞుండగు సంజయుండు దండుననుండి హస్తిపురంబున కరుగుదెంచి ధృతరాష్ట్రు మందిరంబు ప్రవేశించి, యంతఃపురంబున నున్న యన్నరనాథుం గనుంగొని, కృత ప్రణాముం డగుటయు, నతం డాదరించిన నాసీనుండై; ౨

క. బలవిక్రమములు వినుతం
బులుగా మనమొనలుఁ బాండుపుత్రానీకం
బులు రెండునాళ్లు పోరుట
దెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా. ౩

వ. అని పలికి కర్ణునిం బ్రశంసించి— ౪

చ. "పరకుగొనండు పాండుసుతసైన్యనికాయము నింతకేనియుం,
గరులు రథంబులున్ హరులుఁ గాల్బలముల్ దనవీఁక విచ్చియున్
మరలియుఁ దూలియుం బిలుకుమాటియు నగ్గడఁ బాఱియున్, వియ
చ్చరులకు వేడ్కసేయ భుజసారము శౌర్యముఁ జూపె నేపునన్. ౫

తే. 'కాడుదల నొందెఁ, బట్టము పాండుతనయ
ముఖ్య, వీరు వారన నేల? మునుము వట్టి
వైరివర్గంబు నెల్లను వారి సమరి
సైన్యయుతముగ నద్భుత జయము గొనుము; ౬

వ. నడవు' మనుటయు, నమ్మాటఁ గైకొని, కర్ణుండు శల్యునిం దేరు నడవు మనిన, నంత నట్ల చేసె. నప్పుడు శంఖభేరీప్రముఖ తూర్యనాదంబులు రోదసీగహ్వరంబు విహ్వలంబు గావించె. నవ్విధంబునం జని చని, గర్వాగ్రహావిధేయుం డగు రాధేయుం డమ్మద్రపతి కిట్లనియె:- ౭

—♦ ఎత్తుకొనఁగ నే శల్యుని అచుపలుకులు ♦—

శా. 'నారాచాది మహోగ్ర బాణపటలీ నానావిధోల్లాసముల్
వైరింపన్ ధృతి లేక పాండుతనయుల్ సంభ్రాంతి నొందంగ, వి
స్మేరం బై భటవ్రజంబు వొగడన్, మెచ్చంగ నీమాడ్కి, దు
ర్వారోద్యగత నేఁడు సూపెద భుజావష్టంభసంరంభినై.' ౮

సీ. అన విని, మద్రరాజాతని కిట్లను:-
'సత్యపరాక్రముల్ శౌర్యఘనులు
భుజవీర్యమహితులు భూరితేజోధను
లఖిలాస్త్రవిత్తము లార్య, యమర
పతి కైన రణమున భయము పుట్టింపంగ
నోపుదు రప్పాండుభూపతనయు,
లేల వారల నింత దూలపోఁ బలికెద?
విప్పుడు వల్క రా దెట్లు నీకు,
తే. గాండివజ్యానినాదమ్ము గ్రమ్మి కర్ణ
విదళనము సేసినను, భీముగద మెఱుంగు
లొలపి చూడ్కులు మిఱుమిట్లు గొలిపినను, భ
యంబు పెల్లున నపుడు వా యడఁగుఁ గాక!' ౯

వ. అని వెండియు; ౧౦

ఉ. 'నరుని శరంబులన్ రథగణంబులు గూలఁగ, భీము నుల్లన
త్పరిఘమునన్ గజవ్రజము భగ్నము గాఁ, బెఱతమ్ములున్ యుధి

స్థిరుఁడును దాఁకినం జలము డించి దొరల్ గలఁగంగఁ జూచియుం
ధీర మయి నీవు నాలుకకుఁ దెచ్చినమాట గదా వినం దగున్.' ౧౧

క. అచపలుకులు వినియుం దా
విననిచెవులు సేసి, మద్రవిభుతో రాధా
తనయుఁడు: 'నా చేతిబరువు
గనుఁగొనియెద విపుడ' యనియె గం డమరంగన్. ౧౨

వ. ఇట్లు సంగరోత్సాహదీప్తుం డై నడతెంచు నతని నుపలక్షించి; ౧౩

చ. *కురుబల ముబ్బి యార్చెఁ, బటుఘోటక హేషిత నిస్వనంబులుం
గరివర బృంహితధ్వనులు గాఢము లై విలసిల్లె; నెత్తురుల్
గురిసె. నభంబు మ్రోయఁ బిడుగుల్ మొరసెం, బొరి నుల్క లెల్లెడం
దొరఁగెఁ, బ్రదీప్తమారుతము ధూళిఁ గడుం బడిఁ జల్లె భూవరా. ౧౪

వ. మఱియు బహువిధోత్పాతంబులు గౌరవులకు నాశంబగుటం దెలుపుచుం దోఁచెఁ; దోఁచిన, నవి యెల్ల సరకుగొనక, వారు దైవమోహితులుగావున, శల్యసహితుం డైన కర్ణుం గనుంగొని కుంతీనందను లతనిచే నిర్జింపఁ బడుదుర కాఁ దలంచి సంతోషించి; రతండు భీష్మద్రోణుల దోర్వీర్యంబులు పాండుతనయులచేతఁ గోలుపోయె నని మనంబున వారల మెచ్చక, ముంగలియై మెఱసి నడచుచుండి, పార్థపరాక్రమస్మరణంబునం గ్రోధంబు జనియించి యూర్పులు సందడింప, మానదర్పోన్మాదంబున మద్రపతి కి ట్లనియె:— ౧౫

—♦ రాధేయుని మానదర్పపు మాటలు ♦—

మ. 'అరదం బెక్కి శరాసనంబు గొని తెం పారంగ నే నేచి, సం
గరసంక్రీడకుఁ జొచ్చినం దృణసముం గాఁ గొందు నద్దేవతా
వరు నైనన్; గురు నాపగాతనయుఁ జావం జూచుటన్ వైరు లే
తురు. చెండాడెద నగ్రతం దలలు. నాదోర్దర్పముం జూడుమీ!' ౧౬

* ఒకే శ్లోకమున క్రియలను ఎక్కువగా ఉపయోగించు కవిని ఆఖ్యాతకవి అందురు. (రాజశేఖరకవి - కావ్య మీమాంస) ఈ శిల్పమున తిక్కనచేయి ఆరితేరినది. ఈ చంపకమాలలో ఆరు క్రియలనువాడి, సంభవించిన కార్యపరంపరకు బిగువు కలిగించినాఁడు. ఈయన కవనమున ఇట్టి పనితనములు పెక్కులు. భీముఁడు దుష్షేనునిపై గదయు పద్యములు (కర్ణ-3; 211, 214) ఇట్టి పక్కిలో కళాఖండములు.

వ. అని పలికి యనంతరంబ, గాంగేయ కుంభసంభవు లంతటిమానవులు విల్లు రిత్త పోవు వత్తురే యని యుగ్గడించి, మఱియు ని ట్లనియె:— ౧౭

ఉ. 'వారల లోకవీరుల నవధ్యుల గీటడఁగించి, వల్మ్యరక్షా
వారలయట్ల యెందు ననివార్యు లనం జను షేదిసీకులం
బోర వధించి, రౌద్రమునఁ బొంగి క్రమాగతమృత్యువాక్కొ నాఁ
గా రణకేళిం గడఁగు గాండివి నేఁ డెదిర్చి యోర్చెదన్. ౧౮

ఉ. 'పాండునృపాగ్రనందనుఁడు పావనియుం గవలుం బలంబుమై
నొండొరు మూదలింపకొని యొక్కటఁ దాఁకినఁ, దీవ్రవిస్ఫుర
త్కాండ విదారితాంగకులఁగా నొనరించి, యలంచి లీలమై
గం డడఁగింతుఁ, బోక పెనఁగం గలవంద మెఱింగి పెండుదున్.' ౧౯

క. అని పలికి పెండియును వి
ట్లను-'భీష్ముఁడు దెగిన ద్రోణు నతులిత దివ్యా
స్త్రవిచయము దోర్విలాసం
బును జాలం గలిగియుండె భూనుతమగుచున్. ౨౦

సీ. 'ద్రోణుండు బహుదివ్యబాణదీప్తుఁడు భుజా
బలశాలి శౌర్యసంపన్నహృదయుఁ
డక్షీణవిక్రముఁ డతిరథశ్రేష్ఠుఁ డ
వ్వీరుండు పార్థుచేఁ బోరఁ బడిన,
ధార్తరాష్ట్రులయేపు దఱిఁగెఁ, దదాప్త పై
నికులు గం దడఁగిరి, నీ వెఱుంగ
నైనను రాముఁ గృపాతిశయంబునఁ గవిన
యీ రథమును గార్ముకాది

ఆ. దారుణాస్త్రశస్త్రతతులను గలిమి, నే
నతనిఁ దొడరి దివిజు లడ్డపడినఁ
గూల్తు నెల్లభంగిఁ గురురాజు మన్నన
యప్పు దీర్తుఁ బ్రాణ మాసపడక. ౨౧

—◆ శల్యుఁడు అర్జును పరాక్రమము ఉగ్గడించి కర్ణుని శంకించుట ◆—

వ. అవిన విని, శల్యుండు గర్ణున కిట్లనియె:- ౭౧

చ. 'వినిన జనంబు లితఁ డవివేకి యనఁగా వల దింతరజ్ఞా, ల
ర్జును బల శౌర్యసంపదలు సూచి యెఱుంగమె మున్న? విన్న, నా
తనిఁ గలనఁగా జగం బెఱుఁగదా? యతఁ డద్భుత విక్రమోజ్జ్వలుం,
డెనయుదె నీవు పౌరుషవిహీనుఁడ? వద్దివిజేంద్ర నందనున్. ౭౨

సీ. 'రాత్రిమైఁ బోఁకి క్రూరతఁ జోరి మగఁటిమి
వాపిన యంగారపర్ణుకంటె,
ఘోషయాత్రావిధిఁ గురురాజుఁ జెఱపట్టి
మాన మేదిన చిత్రసేనుకంటె,
ఖాండవోద్యానంబుఁ గావ నేఱక సిగ్గు
వడి చన్న నిర్జరప్రభునికంటెఁ,
గ్రీడాకిరాతుఁ డై క్రోడంబునకుఁ గాఁగఁ
బెనఁగి చిక్కిన త్రిలోచనునికంటె,

ఆ. నెక్కు డైనవీరుఁడే? నర్జునవితోడఁ
బోరుతు నోడుతు ననినఁ బోలఁగాక,
వినుము సూతతనయ, మనబోఁటు లాతనిఁ
జెఱుతు మనుట నోరిచేటు గాదె. ౭౩

చ. [1]'నృపుఁడును భీష్ముఁడుం గృపుఁడు నీవు గురుండును దత్సుతుండు న
గ్రపుబల మేచి తోనడవఁగా, బెనుదాఁడిగఁ బోయి. మత్స్యనా
థు పసులఁ బట్టి. యద్దారలతోఁ జెడి పాఱితి. కర్ణ. యప్డు: క
య్యపు బలు పాడె దిప్డు. మన యర్జును నమ్ములు ద్రుప్పు పట్టెనే! ౭౪

---

1. ఈ గోగ్రహణయుద్ధమున కౌరవయోధులనందరిని ఒక్క మూటకట్టుగా, ఒక్క సవ్యసాచియే ఒంటిచేతిగెలుపును సాధించియేయుండినచో, ఆవల 18 అక్షౌహిణులు. అందరే నాయకులు అట్లు 18 నాళ్లు పోరవలసిన అగత్యమేల? అని, చాలమంది సంశయించిరి. ఒద్దికలు చూచుకొనుటకో (Dress Rehearsal) అన్నట్లు జరిపిన యీ విరాటుని ప్రోల జరిగిన పోరు, ధనంజయుని అధిక్యతను చూపను అవల దూర్చబడినది-అని, ఆ విమర్శకుల మతము.

ఉ. 'మందరియట్లు గాదు, జనముల్ దెగడంగ వెఱఁ బాఱ; నేఁడు సం
క్రందనసూతి మార్కొని తిరం బిటు పోరెద, దాఁపఁ బ్రాణముల్,
నిందకుఁ జాల నింక, నను నిక్కపుఁబల్కులు పల్కు టొప్పు దా
నం దుదిఁ జచ్చినం జను, మొనం గని నరుఁ దాఁకుట రిత్త వోవునే?' ౨౬

వ. అనవుడు, నలుక వొడమిన నదలించికొని, రాధేయుండు మద్రపతి కి ట్లనియె:- ౨౭

చ. 'నరునకుఁ బూని పల్కితి వనం జవిమాలిన దొడ్డపల్కు, లే
నరగలి లేక పె ట్టదరినప్పుడు సూడుము నన్ను నాతనిం
దిర మయి బాహుశక్తియును ధీరతయుం బెరవుం బలంబు నె
వ్వరిదనఁ గాంచి తెక్కుడుగ వారి నుతింపుము, మాను మంతకున్.' ౨౮

వ. అనుటయు 'నట్ల చేసెద' నని పలికి శల్యుం డూర కుండెఁ. 'దేరు వోని' మ్మని రాధేయుండు దఱిమి పలికిన, నమ్మద్రేశ్వరుండును దురంగంబుల నత్వరంబుగా నడపె. నివ్విధంబునం జని, మన మొన సొచ్చి సైనికులు సంతసిల్లి వారలం గలయం గనుంగొని కర్ణుం డి ట్లనియె:— ౨౯

—అర్జునుఁ జూపిన వానికి పసదనం బిత్తునని కర్ణుఁడు సైనికుల ప్రబోధించుట—

సీ. 'వలను శోభిల్ల నెవ్వఁ డైన నీఁడె య
ర్జునుఁ డని, నాకిప్డు సూపెనేనిఁ
బసదనం బే నిచ్చుభంగి యందఱకును
వివరించి చెప్పెద వినుఁడు:- మీరు
వొగడంగఁ దగురత్నములతోడి సౌవర్ణ
రథములు వలసిన రయము లావు
బొలుపును గలుగు కాంభోజహయంబుల,
వలసిన దేప్ప సత్త్వంబునందుఁ

తే. బరిణతములగు సుందర కరివరముల,
వలసినను జారులావణ్యవతుల, వలసి
నను మహాగ్రామముల. వలసినను గోర్కి
కెక్కుడ మ్మేటిమగని కే నిచ్చువాఁడ. ౩౦

క. 'మఱియొక్కటి చెప్పెద. వి
ద్దఱు కృష్ణులఁ జంపి, వారిధనములు నా, కి

త్తఱిc-దద్రథ మిదియే-యని
యెఱిcగించినయతని కిత్తు నేనుc ముదమునన్.' ౩౧

వ. అని పలికి శంఖం బొత్తిన, దుర్యోధనుం డనుజసహితంబుగాc బ్రమోదంబు నొందె. నప్పుడు నిస్సాణాది తూర్యనిస్వనంబులు దిక్కులం బిక్కటిల్లె. మన యోధవరులును వరూథినియు నుబ్బున బేర్చి యార్చిన. నినదంబులు నింగిముట్టె. నయ్యెడc బ్రహసనభాసురముఖుండై మద్రవిభుండు రాధేయున కి ట్లనియె:- ౩౨

—♦ కర్ణుని బీరపుమాటలు విని, శల్యుcడు ఎత్తిపొడుచుట ♦—

ఉ. 'ఎవ్వరు చూప నేల నరు! నిప్పుడ కాంచెదు. రిత్తవారికిం
గ్రొవ్వున నుజ్జ్వలార్థములు గొం డని యీవల. దిట్టు లిచ్చిన
నవ్వ జనంబు. మిక్కలి ధనంబులు గల్గినc జేయ రాదె పీ
కెవ్విధి నైన నద్వ్యయము లెందు. నపాత్రపుటీవి యొప్పునే!' ౩౩

వ. అని యంత నిలువక, ౩౪

క. 'కొలcది యెఱుంగక [1]కృష్ణులc
గలవ గెలుతు ననియె దీవు. గంటిమె సింగం
బుల నెత్తఱి నైనను. వే
పొలమున నేనియును నక్క పోరి గెలువcగన్! ౩౫

ఉ. 'అగ్గి సొరం దలంచునటు లర్జును [2]నెక్కటి దాcకc గోర్కి! నీ
కెగ్గిది మాను. మీపలుకు లెవ్వరుc జెప్పcగ లేరు; రూపఱ
న్నగ్గcగc గాల మయ్యెనొకొ! నావచనంబు లొకింత కర్ణము
లగ్గల నిచ్చి. యోధుల బలంబులుc దోడుగc బోరు టొప్పగున్. ౩౬

1. ఒక కృష్ణుడు దేవకీ కృష్ణుcడు; రెండవవాcడు అర్జునుcడు. ద్రౌపదికిగూడ కృష్ణ యనియే పేరు. ఇట్లు భారతమున ముగ్గురు కృష్ణులు గలరు. అనcగా నల్లని మైచాయివారు వీరు. విరాటపర్వములో పార్థుcడు ఉత్తరునికి, తన పేర్లు - వాటి అర్థములు చెప్పునప్పుడు, అర్జుననామమునకు తెల్లనివాcడని అర్థము చెప్పుకొనుట కొంత వ్యత్యాసముగానున్నను, భారతమున మిగిలచోట్లన్నిటా - అసితోత్పల వర్ణదేహుడు, నీలోత్పలవర్ణుcడు - అనియే అర్జునుగూర్చి చెప్పcబడియున్నది.

2. ఎక్కటి=జెట్టి; వీరుcడు అని సామాన్యార్థము. పూర్వము రాచగాదెలకు కావలాయుండు వాcడే ఎక్కటి. ఆనాcడు రాజు శుల్కమును ధాన్యరూపకముగా దండి, ప్రతి ఊర గాదెలలో నిలువచేసి, ఎక్కటీలను రక్షకులుగాబెట్టి. వారిని బాగా మేపుచుండేవారు. రెండు గ్రామాల

ఆ. ఏను ధార్తరాష్ట్రహిత మాచరించుట
కై పెనంగి, చెవుల కప్రియంబు
లైన నిష్ఠుమాట లాడితి, నాబుద్ధి
విని దురాగ్రహంబు విడువ వలయు.' ౩౪

వ. అనవుడు నల్గి, సూతసుతుం డాతని కి ట్లను:- మద్బలంబు నె
మ్మిన, నను వి త్తెఱంగునకు మేకొన కుండఁగ మాన్ప వజ్రహ
స్తునకు వశంబు గా దనినఁ, జొప్పడునే వినుఁబోఁటి? [1]శాస్త్రిఁ జె
ప్పనక్రియఁ జెప్పి నీవు వెఱపించిన నే వెఱ పెక్కువాఁడనే?' ౩౫

—♦ కర్ణునికి తిరికిమందుపోసి, ఉల్లము కలంచుటకు శల్యుడు ప్రయత్నించుట ♦—

వ. అనుటయు; నతని నగ్గలంబు కోపింపంజేయుటకై శల్యుండు మఱియు నిట్లనియె:-

తే. 'ఇప్పుడే నీకు బుద్ధులు చెప్ప నేల?
నరుఁడు గాండీవ గుణనిక్వణంబు చెలఁగఁ
గదిసి, నీమెయి బలుతూపుగములు నిగుడఁ
జేసి, నిను బుద్ధిమంతునిఁ జేయుఁగాక.' ౩౬

వ. అని, యంతం దనివోక యతండు— ౩౭

సీ. 'రోష మహాటోప భీషణహరితోడ
నమరంబునకు హరిణము గడంగి,
ఘనధా రాభీల దంతావళముతోడ
సంగ్రామమునకు శశంబు గడఁగి,
చండస్వభావోగ్ర పుండరీకముతోడ
వాటికి సారమేయంబు గడఁగి,
దారుణ తుండాతిఘోర గృధ్రముతోడఁ
గలహంబునకు నురగంబు గడఁగి,

---

మధ్య ఏదైన వివాద మేర్పడినచో, ఇరువాగుల వా రందరు దొమ్మిగా కొట్టుకొనక, ఆ పూరి ఎక్కటికి యీ ఊరి జెట్టికి పోరుపెట్టి, ఏఊరి ఎక్కటి గెలచునో ఆఊరి పక్షంగా వివాదం పరిష్కరించేవారు. భారతయుద్ధంలో చివరన, మడుగు ఒడ్డున జరిగిన దుర్యోధన భీముల పోరే ఎక్కటి కయ్యము. ఈ కయ్యము, యూరపులో ఇద్దరి స్పర్థాపరిష్కారమునకుగా కాలుదువ్వి సాగించే Duel వంటిది. ఇది వట్టి ద్వంద్వ యుద్ధము కాదు. ఇక్కడ 'ఎక్కటిదాక' అనగా ఎక్కటి కయ్యమున తలపడ, అనుట.

1. శాస్త్ర చెప్పిన.

ఆ. యెదరువట్లు గాదె యస్త్రకళా సము
జ్జ్వలుఁడు పార్థుతోడ సంగరమున
కీవు గడఁగి యడరు టెల్ల? రాధేయ, నీ
కెట్టిబలము నమ్మ నెందుఁ గలదు?' ౪౩

—◆ కర్ణుఁడు నిజ దివ్యాస్త్రబలమును, శస్త్రవిద్యాపరిణతిని వెల్లడించుట ◆—

వ. అవియె. నివ్విధంబున నధిక్షేపింపంబడి కర్ణుండు గోపించి, కెంపారుకన్నులం బా
శల్యు నాలోకించి— ౪౪

క. 'గుణవంతుల గుణములు ని
ర్గుణుఁ డెఱుఁగమి దెల్ల. మీవు గుణహీనుఁడ, వీ
గుణ మితవియందుఁ గల దని
గణుతింపఁగ నైపుణంబు గలదే నీకున్? ౪౫

సీ. 'అర్జును నస్త్రవిద్యాప్రమాణంబు నా
యెఱిఁగినయంత నీవెఱుఁగ, వతని
కొలఁదియు వనమాలి కొలఁదియుఁ గాంచి నా
కొలఁదియు నెఱిఁగి, వారల మదీయ
దివ్యాస్త్రబలమునఁ దెగటార్ప నగు నని
యే నిశ్చయించితి. నెట్టు లనినఁ—
గడుఁబెద్దకాలంబు గంధపుష్పాదుల
నర్చించు చున్నాఁడ ననుదినంబు,

ఆ. దొనఁ గరంబు భక్తి నువిచిన మున్నది
యహిమయంబు, దారుణాస్త్ర మింత
యింత యనక యెదిరి నాహుతి గొను, దాన
జిష్ణు నోర్తు, నొండెఁ గృష్ణు నోర్తు। ౪౬

వ. 'భార్గవాస్త్రంబున నొక్కవిం బొరివృత్తు: నట్లుఁ గాక యాదవ పాండవ వివహంబు
లోనం గృష్ణార్జునులయందు లక్ష్మీవిజయంబులు సుప్రతిష్ఠితంబు లై యుండు,
నయ్యిరువురం బొదివి పెనంగం గనుటకంటె మేలునుం గలదే। వారల గరుడ
కపిధ్వజంబులుఁ జక్రగాండీవంబులు బెండుమానుసులకు భీషణంబులుగావి. వారుఁ
బరితోషణంబులు. వేవురుగోవిందులుఁ బదివేవురు పార్థులుఁ బన్నినం బోరెద.

నీవు మహాయుద్ధకోవిదుండవు గామింజేసి వెఱచఱచి. కాఱు లఱచెద: వక్కడి పక్షపాతంబునఁ బ్రేలెదవో యెఱుంగ; వింక నిట్టిమాట లాడితేని ప్రాణంబుల కోర యొల్లవని పలికి వెండియు— ౪౬

—◆ *కర్ణుఁడు శల్యుని మద్రజాతి దురాచారములను పొరబట్టుట ◆—

సీ. *విను. పాప[1]దేశసంజనితుండవగు నీకు
దుర్బుద్ధి గాక సద్బుద్ధి గలదె?
క్షత్రియాధమ. నీచ. కలదు లోకంబున
నాబాలగోపాల మైన వాక్య-

---

* మద్రదేశీయులను గురించి, సంస్కృతభారతము ననుసరించి ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులో (1966 గౌహతి) అధ్యక్షుడు ఆచార్య-డాక్టర్ వాసుదేవ, ఎస్. అగ్రవాల (M.A; PH, D.; D. Litt; వారణాసి హిందూ విశ్వవిద్యాలయము) ఇట్లు వివరించిరి:- ఇది కర్ణపర్వమున మద్రక కుత్సనము అను శీర్షికక్రింద నున్నది.

మద్రకులు యవనులు; అనగా గ్రీసుదేశము నుండి (Indo Greeks) మన దేశమునకు వచ్చినవారు. వీరు మొదట (నేటి పాకిస్థాన్) సియాల్‌కోట అనబడే సాకలదేశమున ప్రవేశించి, అచటి మద్రకులతో కలసి ఆ ప్రాంతమును పాలించిరి. వీరికి కురుజనపదము, రాజస్థానములతో సంబంధ మేర్పడినది.

మొదట, మద్రదేశీయులు పవిత్ర పంచనదీప్రాంతమున సదాచార సంపన్నులుగా నుండిరి. కాని యవనుల సంపర్కముచే ఆర్య సంప్రదాయమునకు గర్హ్యములైన ఎన్నియో సాంఘికాచారముల అలవరచుకొనిరి.

ఈ దురాచారములను కర్ణపర్వము ఇట్లు వర్ణించుచున్నది. (27. అ. 71.) మద్రదేశము పాపభూయిష్ఠమైనది. అచటి స్త్రీ పురుషులు-ఆ బాలయౌవనులు, విషయలోలురై నీచగాథలనే పరమోత్కృష్ట గ్రంథములుగా గానము చేయుదురు.

మద్రకులను గూర్చి కొన్ని బ్రాహ్మణములు ఇట్లు చెప్పుచున్నవి:- మద్రకుఁడు స్నేహితునిగూడ మోసగించును. మద్రకునితో స్నేహబంధ ముండరాదు; ఎందులకనిన - అతని మాట నమ్మదగినదికాదు. అతని మనసంతా ద్రోహచింతతో నిండియుండును. దుష్టగుణోన్నతి స్వరూపమే అతఁడు. చుట్టములందరు - ఆడ మగ, చిన్న పెద్ద, పనిబాటలవాండ్రు ఒకటిగా గుంపుగట్టి, ముక్కు మొగము ఎరుగనివారితో గలసి వినోదింతురు. వీరందరు, శ్రీమంతుల ఇండ్లలో చేరి, గోమాంసమును తిని, త్రాగి, అరచి అల్లరిచేసి, నీతిని విడనాడి, ధర్మాతిక్రమణమును గావింతురు. ఇట్టి మద్రకుఁడు స్నేహానికిగాని, విరోధానికిగాని అర్హుఁడుగాఁడు. మద్రకునికి శౌచమునందు నమ్మకములేదు. అతఁడు హితునివలె నటించి తేలువలె కుట్టును. మద్రకస్త్రీలు మద్యపానమత్తులై సిగ్గువిడిచి, గుడ్డలు విప్పివేసి నృత్యముచేయుచు, చివరకు కామపరాయణమైన చేష్టలలోనికి దిగిపోదురు. (కర్ణ-అ. 30: 30-33.)

1. జాతి.

మతికుటిలుండు, సంగతుఁడుగాఁ డేమిటఁ,
తెలిసిఁ గీ డొనరించుఁ, జెట్ట పలుకు,
దష్టాత్మకుఁడు, గడుఁ గష్టుఁడు మద్రకుం
డమనంతవట్టుఁ బ్రత్యక్ష మయ్యె।

ఆ. వాని లేక యెల్లవనితలుఁ బురుషులుఁ
గలయ మీకు నెగ్గు గాక యుండు;
మున్న గల్గు పిదపఁ జన్నుఁబా లై పెరు
గుదురు, సెప్ప నేల గుణము లింక? ౪౭

క. 'పలుపురకుఁ బుట్టి, విచ్చలఁ
గలు ద్రావుచుఁ బెరిఁగి, యెట్లు గఱతురు శీలం
బులు నుచితము లగుభాషణ
ములు? వీ విమ్మాట లుడిగి పొదపొద మనికిన్. ౪౮

చ. 'మఱియొకఁ డేను జెప్పెద-నమానుష విక్రమలీల నల్గడం
బఱపియుఁ జంపియుఁ బరిషన్నృపాలకసైన్యము రూపడంచి, మై
దొఱఁగుట యెప్పుడే తనువు దూఁటులు గాఁ। బెఱవారి గెల్పుకో
లుఱదొకొ, నాదుపెం పుడుప నోపుదురే వినుబోఁటు లెమ్మెయిన్? ౪౯

---

మద్రస్త్రీలు, దశరకదేశంలో ఆడుఒంటెలు విలువంటి యుంటునట్లు విలబడియుందురు. సిగ్గు పరువు మేరలన్నిటిని వీరు దాటిపోయినారు. తన్నబిడ్డలు, కట్టుకొనిన మగని అయినా వదలవచ్చుగాని సువీరతమును (తిక్తపానీయము) వదలజాలమని, వింతవింత హస్తవిన్యాస ములతో చెప్పకొందురు.

మద్రకులు అపాదమస్తకము పాపములో ఊరిపోయి ఉన్నారు. మ్లేచ్ఛదేశంలో పుట్టిన వీరికి ధర్మసంగతి ఎట్లు తెలియును? (కర్ణ. 27-91)

బాహ్లకులు:

భారతమున పేర్కొనబడిన బాహ్లికులుగూడ గ్రీసునుంచి వచ్చినవారే; వారు 'వాహికా' నదీతీరము (పంచనదీతీరము)నకు వచ్చి చేరగనే మద్రక యవనులైపోయినారు. దీనివల్ల యీ పవిత్రభూభాగము కుదేశమైపోయినది.

వీరికి మద్రకుల గుణములన్నీ అలవడినవి. బాహ్లకస్త్రీలకు భర్తలుండరు. వీరు హింసా ప్రియులు. వీరు విపర్యులు. అన్ని జంతువుల మాంసమును తిందురు. వీరు వృత్తికి మలమూ త్రంటివారు. (కర్ణ-30. అ-58.) తెలుఁగు కర్ణపర్వము 2-109.

వ. 'కినియించి, గదం దల వగుల ప్రేటువడక, యూరక తేరు వోవి'మ్మనవుడు మద్ర
పతి యతని నవలోకించి—— ౨౦

ఆ. 'హితము సెప్పఁ దగనె యే నీకు? నదియును
గాక నీరతంబు గడపు చుండి
కౌరవాధినాథ కార్యార్థి నగునాకు
మన్నరూపు సెప్పకుండ నగునె? ౨౧

ఉ. 'సారథి దక్షుఁడై, రథికసారము రథ్యబలంబు నాయుధో
దారత మానముగా రణవిధంబు నిమిత్తశుభాశుభత్వ ని
ర్ధారణముగా మదిం గని, హితం బెఱిఁగించుట నీతి గాన, నీ
పేరన మెత్తనోఁ బలికి తేనియుఁ, జెప్పుదు సూతనందనా. ౨౨

వ. 'ఏ నేమితప్పు సేసిన గదం దల వగుల ప్రేసెదవు? నీ వి ట్లంటిని గదా యని,
హితోపదేశంబు సేయ మాననేర్తునే? యిది యొకదృష్టాంతంబు వివరించెద
వినుము; విని నీవు నాచెప్పినట్ల చేసితేనియు మేలు. సేయకుండిన గడు మేలని;
యి ట్లనియె:— ౨౩

—♦ ఎంగిళులు దిని క్రొవ్వి, హంసను ఎదిరించి పరువుపోగొట్టుకొనిన కాకికథ ♦—

సీ. 'అంబుధిలో నొక్క యలఘుతరద్వీప
మున ధర్మవర్తి నాఁ జను నరేంద్రు
పురమున, నొకవైశ్యవరుఁ డద్వరాది స
త్కర్మఠుఁడును శాంతిదాంతియుతుఁడుఁ
గరుణాపరుఁడు దానవిరతుండు ధనధాన్య
శోభియు. బహుపుత్రలాభ విలసి
తుండునై వర్తించుచుండఁగ విలు సేరె
నొకకాకి; యతని పుత్త్రకులు దాని

తే. కెంగిళులు పెట్టికొని యూర, నెలమిఁ బెరిగి
క్రొవ్వి కడు మీఱి, యెట్టిపక్షులను దన్నుఁ
బోల వనియెడు దుర్మానమునఁ దృణీక
రించి, యది పెక్కుతంగులఁ గ్రీడ సలుపు. ౨౪

వ. 'ఇట్లు విహరించుచుండ, నొక్కనాఁడు గొన్నిహంసంబులు పక్షబలంబున సుప
ర్ణుతో సరిసేయం దగునట్టివి, సముద్రంబుచేరువఁ జనం గని, యా కోమటి
కొడుకు లక్కాకంబునకుం వానిం జూపి యిట్లనిరి :— ౫౫

క. "పులుఁగులలో నీ వెక్కుడు,
విలసద్గతి సంచ లిట్లు వినువీథిఁ గరం
బెలమిం జనియెదు. నీవిం
గలపి పఱచి గెలువవలదె గతుల విహంగతతిన్ ?" ౫౬

వ. అని తారతమ్యజ్ఞానహీనులగు నయ్యల్పబుద్ధులు సెప్పిన, నుచ్ఛిష్టదర్పితం బగు
నదియును మౌర్ఖ్యంబునం దా నంతటివాన నని తలంచి, వానిదెసకుం జని,
మనంబున 'వీనిలో నేటి యెయ్యదియో'-యనుచుం జేరి, తనచూడ్కికి వచ్చిన
యంచం బురుడించి-"పఱతము ర"మ్మని పిలిచిన, నయ్యంచలన్నియు నిలిచి
బెలుచ నవ్వి యవ్వాయసంబున కిట్లనియె :— ౫౭

క. "మానససరసి వసింతుం, మ
హీనదులముఁ జనముఁ బక్షు లెల్లను బొగడం
గా వెండుఁ దిరుగుదుము, ద
వ్వైనమ భేదంబు లేదు హంసల మగుటన్, ౫౮

వ. "ఇట్టి మా యందును; ౫౯

క. "బలశాలి యైనహంసముఁ
బిలిచితి పురుడించి పాఱ బేలతనమునన్;
గలవే యింతకు మును హం
సలతో బురుడించు వాయసంబులు జగతిన్ ?" ౬౦

సీ. అనుటయుఁ, గాక మిట్లను హంసములతోడ
"గతులు నా కొక్కటిగలవు. *వాన
నొక్కొకటొక్కట శతయోజనవ్యాప్తి నే
మెఱయుదుఁ, బొదవుగా మీఁది కెగసి

* వాన = వానలో, లేక వానియందు అనుటకు తిక్కన ప్రయోగము. శాంతిపర్వము, 1 ఆ-71 పద్యమునందు "నఱగాలివాన గోవును" అనుచోట చాలమంది యీ 'గాలివాన'లో చిక్కని వెలపడిరి. వాఱుగు కాళ్ళవాటియందు అవు-అనుట.

చమట యచ్చటనుండి చక్క నేలకుఁ జోదు
వట్టి డిగ్గుట, దూరపాతభంగి
సంగతి వరుసది చారులీలాగతి
వక్రియానము వలయక్రమంబు

ఆ. లోమ గాఁగ నెట్టులైనను మీకోరి
నట్ల పఱచి మేటియంచ యైన
దాని విపుడ గెలుతుఁ, దక్కటియంచలు
భయము వొందఁ, గాకిపదువు వొంగ." ౬౦

— ♦ కాకము హంసముతో జలధి చదల బఱచుట ♦ —

వ. అనుటయు విని మున్నాహూతం బైన హంసం బక్కాకంబు నాలోకించి:— ౬౧

ఆ. "మూఱుగతుల నీవు వాఱు, దే నన్నియు
నెఱుఁగఁ, బఱగు లెల్ల నెట్లు వాఱు
వదరి యాకసమున నిపు * బాట నట్ల పా
ఱుదము రమ్ము జలధిచదల" ననిన ౬౨

వ. అయ్యేడం గూడిన కాకంబు లపహసించి. "శతప్రకారగతి యగుదీనితో నేకయాన పర్యవసాన హీనసముత్సాహ దోహలి వగు నీ వెట్లు మచ్చరించెదవు? పఱచి భంగ పడియెదవు గాక" యనుటయు, నమ్మరాళం బాగమిం బాపి పఱవఁ దొడంగినం, దోన యవ్వాయసంబునుం బఱచె. నిట్లు రెండును మున్నీటిపై మిన్ను దఱిసి పాఱునట్టియెడ: ౬౩

క. రాయంచ మందగతిఁ జను,
వాయస మతితీవ్రభంగి వడను మెఱపి రీ
లాయితము లొప్ప బహుగమ
నాయాసము నొంది పఱచు నగ్గలికమెయిన్. ౬౪

---

* బాట = దారి, లేక డొంక-(వండి బాట) బాటపదము హిందీలోగూడ గలదని, ఇది హిందీపదమని కొందరు. ఇట్లే చెప్పు (పాదరక్ష)గూడ ఉరుదూ పదమనేవా రున్నారు. కాని తిక్కన శాంతిపర్వంలో 'చెప్పులిచ్చిన కంటకసస్పృశులైన రిపులద్రొక్కి నడచునతడు' అని చెప్పియున్నాడు. తిక్కన కాలానికి అంతగా తెలుగుకు పారసీకపు తెగులు పట్టలేదు కాబట్టి, ఇవి తెలుగుమాటలే అయి, ఉరుదులో కలసినవనవచ్చును. ఆలు (భార్య) అనేమాటగూడ ఇదే అర్థంలో ఉరుదూలో ఉన్నది. (అల్ ఔలాద్ = ఆలుబిడ్డలు) ఇది దక్కన సాంగత్యప్రభావం కావొచ్చు.

ఆ. ఎలమిఁ గడచి పోవుఁ, బిలుచుఁ గ్రమ్మఱ వచ్చి,
ముక్కు ముక్కు మీఁద మోపు, జుట్టు
నేచి తిరుగు, నీఁక లీఁకలతో రాయు,
నొరయుఁ జిత్రగతులఁ, మఱియు నవ్వు. ౭౬

వ. ఇవ్విధంబునం గాకం బనేకప్రకార ప్రసరణచతురంబై సంచరించుటం జూచి, ముదితంబు లైనవాయసంబు లధికస్వరంబుల మెఱయుచు, హంసంబుల గేలి గొని నవ్వుచుఁ, దరువులపయిం ద్రుళ్ళి త్రుళ్ళియాడుచు "మరాళంబు పరాభవంబుఁ బొందెడుఁ జూడుం"డని, పెద్ద యెలుంగునం బలుకుచుండఁ, దదీయ కలకలం బాలించి హంసంబు ధరితోత్సాహం బై— ౭౭

క. పొడవునకు నెగసి యెప్పటి
పడమటిదెస నిగిడి పెలుచఁ బఱచినఁ, గూడం
గడు రయమునఁ జని యంచం
గడవం గా కీలకఱచి కాకము పాఱున్. ౭౮

వ. పాఱి పాఱి దయ్యుటయు, నయ్యంచ యుదంచిత త్వరితగమన కళావైదగ్ధ్యంబు మెఱయం బఱచిన మీఱువడి, కాకం బాకులాంతరంగంబును వికలాంగంబును నై యిట్లని వితర్కించు:— ౭౯

క. "నేరక తొడరితిఁ, గాల్కొన
భూరుహములు లతలు గిరులుఁ బొడలేమియు లేఁ
వారయ, బహూనత్త్వమయము
వారిధి, దిగి పోఁకినపుడ వలయుం బొలియన్." ౮౦

వ. అనుచు దీనమానసం బయి భయంబునం గలంగి, దప్పి సొగసి, యవశత నంత కంతకు దిగుచున్న యక్కాకిం గనుంగొని కలహంసం బి ట్లనియె:— ౮౧

ఆ. "నీ వనేకగతులు నేర్తు ది యేగతిఁ
జనుట చెపుమ వాయసంబ? యేను
గడవ నరిగి పిలువఁ గా నేల తడపెద?
వెఱక లేటి కిట్టు లెడల విడువ?" ౮౨

వ. అవియె. నట్టియెడ: ౮౩

క. తలకొని జలములు పక్షం
బులు దుండము దోఁక సోఁక, పొరిఁ బొరి వెగయఁగా
బలమఱి మెయి దిగఁబడఁగా
సొలసి, మొగయలేక వాయసుఁడు వెగడొందెన్. ౩౮

వ. ఇట్లు మున్నీటిపీటిపయిం బడి యగ్గలంబగు దురవస్థకు బెగ్గలంబు నొందు కాకంబు నాలోకించి "వలుక నగుం గాక: పలికినట్లు యెవ్వరికిఁ జేయఁ దీఱునె? బని తీరెం గదా!" యనిన రాయంచకు నక్కాకం బి ట్లనియె:- ౩౯

క. "ఎంగి[1]ఱలు గుడిచి క్రొవ్వునఁ
బొంగిన మెయితోడ గర్వమునఁ దిరుగుచు, నా
కుం గలదె యెందు నెదురు? వి
హంగమపతి నైన గెలుతు నని, మును దలఁతున్. ౪౦

క. "నాకొలఁది యిప్పు డెఱిఁగితి.
నీ కారుణ్యాలోకనంబు నిగిడించి, శర
ణ్యా, కావు: నన్ను మగుడం
గాకులలోఁ గలుపఁ దగవు గాదే నీకున్?" ౪౧

వ. అని యిత్తెఱంగున, ౪౨

క. ఆకులతఁ బొంది పలుకుచుఁ
గా కా! యని చంచుఁదెఱచి కడు వఱచు, నీ
రాకరమున మునిఁగెడు న
క్కాకిం గని హంస పరమకారుణ్యమునన్. ౪౩

క. వెరవునఁ దత్తనువుం దన
చరణంబుల నిఱికి యెత్తి, చా వుడిపి, బలి
స్ఫురణంబు మెఱయ నీఁపున
ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్. ౪౪

వ. 'ఇవ్విధంబునం దెచ్చి, యెప్పటినెలవున డించి, రాయంచ యక్కాకి దెప్పిఱిన దానితో నచ్చటికాకులు విన "నింక విట్టి యవినయంబు లెన్నండును జేయకు"మని

---
1. ఎంగిళ్ళు.

పలికి, విజనహచరంబులగు మరాళంబులం దానును వలయుచోటికిం జనియె. నీవు నా కోమటికొడుకుల యెంగిలికూటం బెరిఁగిన యక్కాకంబుచందంబునఁ గురుకుమారుల యెంగిళులు గుడిచి క్రొవ్వి, యెక్కుడువారల ధిక్కరించెదవు; నీకొలఁది యెఱుఁగవు; దీనం జేటు వాటిల్లుఁ గాన తేటపడ నెఱింగించెద నాకర్ణింపుము :— ౨౧

చ. 'విరటుని గోవులన్ మరల వెల్చి, మదంబున నీదు తమ్మునిం
బొరిగొనఁ బార్థుఁ డాఁక కెట పోయితి నాఁ డలఘోషయాత్రలోఁ?
గురుపతి డించి, క్రీడి కృపకుం దగుపాత్రము పేపి యెక్కడన్
సురిఁగితి చెప్పుమా నిజము? సూతతనూభవ, నాకు వేర్పడన్?' ౨౨

వ. అని వెండియు; ౨౩

చ. "పనివడి జామదగ్న్యుఁడు సభన్ వినిపింపఁడె మీకు నెల్ల న
ర్జును భుజవైభవంబు, మధుసూదను పెంపును? నాఁడ ద్రోణ శాం
తనవులుఁ జెప్పరే బహువిధంబుల వారల గెల్వ రామి? మున్
వినమె? యెఱింగియున్ మఱియు వీఱిఁడిమాటలు వేయ నేటికిన్? ౨౪

క. 'ఒంటిమెయిఁ దాఁక నా ము
క్కంటికి వశ మగునె కృష్ణగాండీవులఁ? వి
ట్లంట యుదిగి, తగురథికుల
జంటగొని రణమ్ము నలుపు శత్రులు దలఁకన్. ౨౫

తే. 'గొంతికొడుకును దేవకికొడుకు మనము
గవియెదము దినకరనిశాకరులఁ బోలె
వెలుఁగ; నయ్యెడ ఖద్యోత విలసితంబు
తోడి దగుఁగాక నీపెంపు దోఁపఁ గలదె?' ౨౬

వ. అనిన విని కర్ణుండు:—'కమలనాభునిపెంపును బార్థుబలిమియు నెఱుంగక యేనేల వారిఁ దొడరెద? నీవెట్లు చెప్పినను దొడరుదుఁ; దొడరి వా రొండె, నే నొండె నగుదు; వింతియ! నీవు వెడమాట లాడక యుడుగు'మని పలికి, యచ్చటి మహీపతులు విన నమ్మద్రపతి కి ట్లనియె:— ౨౭

—♦ కర్ణుఁడు జామదగ్ని దత్త అస్త్రబలమును చెప్పి,
తనకుఁ గలిగిన శాపంబులను వగచుట ♦—

సీ. 'తలఁచిన నెవరకు సంతాపంబు సేయంగఁ
జాలెడునట్టివి జామదగ్న్యు
కోపంబు, బ్రాహ్మణశాపంబు గాక, యే
నరకు గొందునె మురహరు గిరీటిఁ?
జెప్పెద విను-మస్త్రశిక్షార్థినై మహేం
ద్రనగంబునకు జమదగ్నిసుతువిఁ
గోరి పోయినఁ, గృపాంభోరాశి యగునమ్మ
హాముని కులము వన్నడుగుటయును,

తే. బొంకునకు నోర్చి బ్రహ్మాస్త్రమునకుఁ గాగ
బ్రాహ్మణుఁడ నని చెప్పి: తత్పాదభక్తి
గలిగి మెలఁగంగ, శిక్షించె నలఘుదివ్య వి
ధాస్త్రశస్త్రసంవేదిఁగా నతఁడు నన్ను. ౮౫

వ. 'భార్గవాభిధానం బగు మహాస్త్రంబు లోనుగా ననేకదివ్యాస్త్రంబు లిచ్చెఁ. బదం పడి బ్రాహ్మంబగు నస్త్రంబు నొసంగె; నొసంగి సమరంబున నాపత్పమయంబున దీనిం బ్రయోగింపు మని యానతిచ్చె. మఱునాఁ డత్తపోధనసత్తముండు మదీ యాంకతలంబున నొఱగి నిద్రించుచుండ, [1]నొక్కజంతువు నా క్రిందితొడఁ దొలిచిన, నమ్మహాత్మునకు నిద్రాభంగం బయ్యెడు నని, కదలకుండితిఁ. దదనంత రంబ మేలుకని, యతండు నెత్తుటివెల్లువఁ గని, తత్ప్రకారం బడిగి, యేను జెప్ప విని, మద్ధైర్యంబున కచ్చెరువడ "నీవు బ్రాహ్మణుండవు గా, వెవ్వఁడ?"వని యొత్తి యడుగుటయు, వెఱచి సూతసుతుండ నని చెప్పితిఁ; జెప్పునప్పు డక్కటకంబు

1. ఈ జంతువు 'అళక'మను కీటకమని శాంతిపర్వము 1-అ-22 లో చెప్పఁబడియున్నది. భాసమహాకవి తన 'కర్ణభారము' ,అను నాటకమున 'వజ్రముఖి' అని చెప్పెనాఁడు. ఈయన రెండుతొడలనుగూడ పురుగు తొలచినట్లు వర్ణించినాఁడు.

భాసుఁడు భారత రచనాకాలమునకు దగ్గరివాఁడు. ఈయన అశ్వఘోషుఁడు కాళిదాసుల మధ్య క్రీ. శ. 150-200 నందున వెలసినట్లు చెప్పుచున్నారు. ఈయన చూచిన భారతపాఠము ఇట్లే చెప్పిఉండవలయునుగదా!

నాలోకించిన, నది యదృష్టపూర్వవికృతాకారంబై యుండెః[1] నర్జునహితంబు గోరి యింద్రుం డమ్మునీంద్రునకు నన్నుఁ దేటపఱచి, యతనిం గోపింపం జేయువాఁడై కీటతనువుదాల్చి యట్లు చేసెం గానోపుః నాసంయమి గోపించి "కపటంబున బ్రహ్మాస్త్రంబుఁ బరిగ్రహించి; తది నీకు వలయుకాలంబున దోఁపమియు మృత్యువాసన్నం బైనం దోఁచుటయు, నాపన ముట్టినయెడ భార్గవాస్త్రంబు దోఁపకుండుటయుం గలిగెడు" మని శపించె; నిది జామదగ్న్యు[2] కోపంబుతెఱంగు. బ్రాహ్మణ శాపంబు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము— ౫౯

సీ. బ్రమమునకై యేను సకలాంబకములు నె
క్కుడువెప నేయ, నయ్యెడకు నొక్క
యాఁబెయ్య యుఱికి నాయజ్ఞానమున నంప
తాఁకునఁ గూలినదాని కలిగి
బ్రాహ్మణుం డధికకోపంబున "నిది హోమ
ధేనువత్సం, బిట్లు దీని శల్య
విహతంబుఁ జేసితి; నీవు నావవన శ
ల్యంబున విహతుండ వగుము; నీకు

తే. సమర మేకాగ్రనిర్భరోత్సాహవృత్తి
నడవ నరదంబుచక్రంబు పుడమిఁ గ్రుంగ
వలయు; నెవ్వీరు మార్కొని గెలువఁగోరి
శ్రమము సేసెద నతనిచేఁ జావు నిజము:" ౬౦

చ. 'అనుటయు, భీతి వేఁడికొని, యావులు వేయును, నెడ్లనాఱునూ
ఱును, రథముల్ శతంబును, మెఱుంగుల మొత్తముఁ బోని యంగనా
జనశతకంబు, దంతిశతసప్తకముం గొని శాంతిఁ బొందవే
యవినను, మానదయ్యె వసుధామరుకోపము తీవ్రరూపమై. ౬౧

వ. 'మానకయున్న, మఱియును; ౬౨

---

1. శాంతిపర్వము. 1 అ. 20-24 లో:-ఈ కీటకము, తాను గ్రస్తుండను పేరుగల రక్కసుడనియు, భృగుపత్నిని అపహరించి శప్తుఁడై యీ రూపుజెందినట్లును, కర్ణుని విలోకనామృతసేకనంబున ముక్తి అయినట్లునుచెప్పి, పూర్వాకృతితో నిజేచ్ఛం జనుచున్నాఁడు. ఇచటవలె, శాంతిపర్వమున ఇంద్రుని వన్నాగమనుపది లేదు.

2. శాపప్రకారంబు.

క. 'నాకుఁ గలసొమ్మె ల్లను
నీ కిచ్చెద నమఁ బ్రసాదు నిరత కటాక్షా
లోకితుఁ జేయు మమఁడు, నతఁ
"డీ కాలంబు మామ"మనుచు వేఁగెం బెలుచన్. ౯౩

వ. 'ఇట్లరుగుచు, నలుకపెంపునం గన్నుల నిప్పులు రాల, మరలి కనుంగొని "నావలుకులకు లొంకునుం గలదే! నీ కీ దుష్కర్మంబు పరలోకంబునకు బాధకంబుగాకుండ నిదియ ప్రాయశ్చిత్తం బయ్యెడుంగాక పొమ్ము! సూతనందనా, యే నెట్లంటి నట్లగుటనప్పు, దరుగు"మనియెం. గావున నా జామదగ్న్య బ్రాహ్మణుల శాపంబులకు వెఱతు. సత్యంబ పలికితి. నీ యున్నరాజులును నాతోడి సుఖదుఃఖంబులకుం గలవా రగుటంజేసి కృష్ణార్జునులకు నే వెఱవ. నింద్ర యమ వరుణ కుబేరులు వజ్ర దండ పాశ గదాహస్తులై బిట్టు ముట్టినను బెదర, నవియుండుదుఁ; దక్కినవారిం జెప్పనేల? యిప్పుడు బ్రహ్మాస్త్రంబునుం దోఁచుచున్నది; యన్నరుని యున్నెడకు మనరథంబు నడపుము. పుడమిజనంబులు మదీయ కోదండపాండిత్యం బొందొరులకుం జెప్పికొని యచ్చెరు వందుచుండునట్లు వేసెద; నమ్మేటిమగని మృత్యువివాసంబు నొందించెద. ౯౪

— కర్ణుఁడు నిజప్రతాపోన్నతిని ఎత్తిచెప్పి శల్యుని దూఱుట —

సీ. 'కాండ మహాతరంగముల వైరుల ముంచు
విజయాంబురాశికి వేల నగుదు;
బాణరశ్మిలఁ బరిపంథులఁ బొదివేఁడు
నర్జునాదిత్యున కభ్ర మగుదు;
విశిఖోగ్రశిఖల విద్విషుల నేర్చు కిరీటి
ఘోరదావాగ్ని కాసార మగుదుఁ;
బ్రదర వేగమున నరాతులఁ గూల్చు పా
ర్థాతివాయువునకు నచల మగుదు;

తే. విల్లు వట్టెడువారికి నెల్ల నెక్కు
డనఁగ నెగడిన గాండీవి నాహవమునఁ
దొడరఁ బ్రాణంబులకు నాసపడు లఘుప్ర
కారులకు వచ్చునే నాకుఁ గాక శల్య!' ౯౫

వ. అని పలికిన విని, యమ్మద్రపతి : 'వీనియంతరంగంబు గలంగెఁ; దా నర్జునుచేత నొచ్చుటయు నిచ్చట నిర్ణయించె, నెట్లనిన:- నిట్టియప్పుడు నివులు దనమీఁదం జాలమి వెట్టకుండుటకుం గాదె జామదగ్న్య బ్రాహ్మణులశాపంబులు భూపాలురు విన నగ్గడించె; నిక్కలంకయే వీరజ్జాలావికి నర్జునగుణవిశేషంబు లెఱింగించి, మదం బడంచిన కతంబునం గలిగెఁ. గౌంతేయాగ్రజునకు నా యిచ్చినవరంబు సఫలంబయ్యె' నని మనంబునం దలంచి సంతోషించెఁ; మనుజేశ్వర వినుము, మా శల్యుండు చెప్పిన యాఖ్యానంబునం జిత్తం బెరియుచునికిం జేసి, యా సూత నందనుం డతనితో గనలుచు మఱియు నిట్లనియె:- ౯౬

క. 'దృష్టాంతము చెప్పెద నని,
కష్టాత్మా, నీవు నన్నుఁ గాకము, నరు న
త్కృష్టమరాళము గాఁగ ని
కృష్టంపుఁగథఁ జెప్పి; తిది సభిత్వము తెఱఁగే? ౯౭

ఆ. 'వీనులకు బలంబు నెట్టిన పరుసని
కాఱు లఱచు చున్కి గాన, యిట్లు
పలికి తింతఁజేసి, భయ మయ్యెనే నాకు?
నట్టిమాట లింక నాడ కుడుగు. ౯౮

క. 'అడిగితినే నిను నాక
వ్వడి భుజబల మెట్టి దని? యవారణ నీ వి
ప్పుడు నృపు లెల్లను విన నా
విడిచి పొగడె దిట్లు వందివిధమున నతనిన్. ౯౯

చ. 'అనిమొన శత్రులం బొగడు టారయ, మూర్ఖతగాదె? యిట్టి దు
ర్జనుల సహింతురే? పెలుచఁ జంపక సైరణ సేయుకాలమై
వినుఁ దెగఁజూడ నైతి ధరణీపతి కయ్యముపై భరంబునన్
గొనకొని, సూతకృత్యమునకుం దగఁ బంచినవాఁడు గావునన్.' ౧౦౦

వ. అని వెండియు; ౧౦౧

తే. 'అకుటిలుం డగునాతు, నత్యంత కుటిల
వృత్తి సహితంబు చేసెద వి త్తెఱంగు?

మిత్రప్రపంచవ మారయ, మైత్రి వత్త
పద కృతోద్ధూతి యవియెడు పలుకు వినమె? ౧౦౨

క. 'జను లెట్టిది మిత్రవిధం
బని చెప్పుదు, రట్టిచంద మఖిలము దుర్యో
ధనునందుఁ గలదు నాయెడ;
మన మూఱడియుండు నా కమందప్రీతిన్. ౧౦౩

క. 'జను లెట్టిది శత్రువిధం
బని చెప్పుదు రట్టిచంద మారయఁగా దు
ర్జనుఁడవగు నీకు నాయెడ
వినుము కలిగె; దీన మనసు విచ్చెం గుటిలా! ౧౦౪

ఉ. 'కావున నీకు నప్రియముఁ, గౌరవరాజునకుం బ్రియంబునుం
గా, విధి మెచ్చ బాహుబలగర్వ మఖర్వము గాఁగ, లక్ష్మికిం
జేవయుఁ, గీర్తి కున్నత విజృంభణముం గలుగఁగా, ముకుంద గాం
డీవులఁ దాఁకి గెల్చెదఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగన్.' ౧౦౫

వ. అని పలికి, మఱియును— ౧౦౬

తే. 'భండనంబునఁ బార్థుచేఁ బడక నేఁడు
మేలుచే యైతివేనియు, మృత్యువునకు
నెన్నఁడును నగపడ; నాకు నివ్విధంబు
సందియము లేక చిత్తంబునందుఁ దోఁచె! ౧౦౭

ఉ. 'వివుల మహాస్త్రముల్ వఱపి, విక్రమసంపద నాకుఁ జూపు న
ర్జును భుజలీల కోర్చెద వసుంధరఁ జక్రము గ్రుంగి నారథం
బునకు నవార్యమై యెడరు పుట్టక తక్కిన; శల్య, చూడుమీ
వను? విశిఖావళీ విలసనంబున నాతనియేపు మాపెదన్. ౧౦౮

—♦ మద్రక, బాహ్లీకదేశ నింద్యోపన్యాసము ♦—

వ. 'నీకు వెఱపింపనయ్యెడు కొలందివారివి వెఱపింపుము, కర్ణుండు విక్రమంబునకుం గీర్తికి నాప్పదం బగుటకు జనియించినవాఁడు గాని, భయంబు గొనుటకుం గాదు. కురుపతి సన్నిధి నీవు పారతంత్ర్యంబునకుం బూనుకొంది, పలికికొన్న బాస కతం

బవ బ్రదికిపోయితి' విన విని, శల్యుం:–'దీయనర్థప్రలాపంబులం బ్రయోజనం బేమి? వినుము: కర్ణకర్ణులు వేవురైనం గిరీటిని గెలువం జాలుదు రే?' యనుటయు. నతండు గిమక నెట్టినైన కమ్నంగవతోడి నవ్వునవ్వుచు. నిట్లను: 'ధృతరాష్ట్ర మహీపతి సన్నిధి నుత్తమద్విజులగోష్ఠి నఖిలదేశాచారవిదుం డైన వృద్ధబ్రాహ్మ ణుండు చెప్ప వింటి: బాహ్లికదేశంబు వారు గోమాంసంబు నంజుకొని మద్య పానంబుచేసి, నగ్నులై యనంగత దురాలాపంబులాడుచుఁ దిరుగుదు రని. తొడంగి యనేకప్రకారంబుల బాహ్లికదేశ నిందోపన్యాసంబు చేసె. నట్టి బాహ్లికుల కొడయుండవు: తత్కృతంబులగు పుణ్యపాపంబుల నాఱవపాలు నిన్నుం జేరు నట్లుం గాక, వారి యనాచారంబులు వారింపమింజేసి యాకల్మషంబు లెల్లను నిన్నుం బొందు. బాహ్లికులకంటెను మద్రదేశజాతు లవినీతు లని యార్యులు చెప్పుదురు. ని న్నేమి చెప్పం గల? దింతవట్టు నెఱింగి, నాలుక యడంచి యుండు' మనవుడు నమ్మద్రేశ్వరుండు— ౧౦౯

క. లావులు రథ్యాతిరథనం
ఖ్యావేళం దెలియఁజెప్పం గాదె భీష్ముం,
డావచనమ్ములు మనమున భా
వింపుము క్రోధ మేల బలియుఁడ నీకున్? ౧౧౦

—◆ ప్రతివచనముగా శల్యుఁడు అంగదేశజనితులఁ దూలనాడుట ◆—

తే. 'విడుతు రాప్తుల బంధుల, వెలలు గన్న
నమ్ముదురు కులకాంతల, నంగదేశ
జనితు లగువారు; విభుఁడ వజ్జనుల: కిట్టి
లేలొకో నొర్ల చరితంబు లెన్న నీకు? ౧౧౧

క. 'పరదోషము చెప్పఁగ నే
ర్తురు గా కాత్మీయమైన దోషంబు మదిం
బరికింపఁగ నధములు నే
ర్తురె? తలఁపక యంటి వలుకతో మండకుమీ.' ౧౧౨

వ. అని యుల్లసం బాడి మఱియును: ౧౧౩

ఆ. 'సకలదేశములను సన్మార్గవర్తులుఁ
గలరు, దుష్టతతియుఁ గలిగియుండు;
మది నెఱుంగనేర్చు మధ్యస్థు లదియును
సదియు నగ్గడింతు రెదురు మెచ్చ. ౧౧౪

వ. 'ఒకదేశంబు దానఁ గీడ యగుట కలుగునే? యట్లుంగాక, సదాచార దురాచారంబులు దైవం బెఱింగెడు; నీ వనాత్మజ్ఞుండ, పూరకుండు' వనియె. న ట్లయ్యిరువురు వివాదంబు సేయుట యాలించి చేరి, కౌరవపతి సఖిభావం బుపన్యసించి, రాధేయు రాజత్వగౌరవంబు గొనియాడి, మద్రవిభుని వారించిన, నా సూతనందనుండు నగుచు శల్యు నుద్దేశించి: 'పద పద; రథమ్ము వోనిమ్ము వోనిమ్ము'ని పలికె. న ట్లరిగి, శల్యుండు సస్మితుం డగుచు వెండియు నర్జును నుగ్గడించి: 'కృష్ణుండు సారథియును గాండీవంబు సాధనంబునునై యప్రతిహతమనోరథుండగు నారథికు తోడం బెనంగ నోపితేని నీవ మా కెల్లను రాజు; నమ్మేటిమగని యరదంబు మన మొగ్గరంబు సొచ్చి చిక్కువఱుచుట గలుగునని, యెఱుంగ నయ్యెడు. మన మేమఱక యుండవలయు; నీతోఁచు దుర్నిమిత్తంబు లనుసంధింపుము. ౧౧౫

## రణము ఉగ్రమగుసూచనలు

క. 'పఱపులు మనచేరువఁ బె
ల్లఱచుట, బెట్టెదురు గాలి యదరుట, గ్రద్దల్
తఱచయి యాడుట, వికృతపు
టఱపులతో రేఁగి కాకు లఱచుట గంటే?' ౧౧౬

వ. అని వెండియు. ౧౧౭

ఆ. 'పిడుగుకాను సూడు పడఁకెడు; మనతేరి
చుట్టు మెఱయఁ గట్టినట్టి చిఱుత
పడగలందుఁ గంటె? పెడలెడు మంట లు
గ్రంబు గాఁగ నోపు రణము నేఁడు.' ౧౧౮

వ. అనియె. నప్పుడు రాధేయుండు ధృష్టద్యుమ్నాభిరక్షితంబయిన ధర్మతనయ వ్యూహంబు గనుంగొని, రథికవరులం దగినయెడల నమర్చి, తనమోహరం బాయితంబు సేసికొని యురవడింప, నమ్మద్రపతి యత్తెఱ్ఱి యాలోకించి— ౧౧౯

ఉ. *'అల్లదె! యర్జున ధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపిం
ద్రోల్లసనంబునన్ మెఱసి; యుద్ధతులైన త్రిగర్తు లేపు శో
భిల్లఁగ వారె యన్నరుని బెట్టుగఁ దాఁకి; రతండు నంపసె
న్వెల్లి నిగిడ్చి ముంచె నదె వింటి గుణధ్వని మ్రోఁగ వారలన్!' ౧౨౦

ఆ. అనినఁ గర్ణుఁ డిట్టు లనియె: 'సంశప్తక
బలముచేతఁ బొదువఁబడి, కిరీటి
మేఘపిహితుఁడైన మిహిరునిచాడ్పున
వాఁడి లేక యున్నవాఁడు గంటె!' ౧౨౧

వ. అనుటయు శల్యుండు—— ౧౨౨

చ. 'వరుణుఁడు నీళ్లచేఁ జెడునె? వాయుసఖుండు మహేంధనోత్కర
స్ఫురణ నడంగునే? నరుఁడు పోరుల నీచుల చేత గల్గు? నె
వ్వరికిని వానిఁ గిట్టుబడ వచ్చునె? గాలిఁ బరాభవింపఁగా
దొరకొనినం, జలంబు మెయిఁ దోయధి యంతయుఁ ద్రావ వచ్చునే? ౧౨౩

ఆ. 'దేవతలకు నైన దేవేంద్రపుత్రుని
నాహవమున గెలువ నలవి గాదు;
మనము గెలుతు మిట్టిమాట లాతనిఁ జేరఁ
జనక యాడి, దీన నంతసింపు. ౧౨౪

ఉ. 'మేరువుపోలె నొప్పిన సమీరణపుత్రుని పేర్మియున్, మహో
దారుఁడు ధర్మనందను సదాత్తతయున్, విజయానుజన్మ లే
పారఁగ నున్నసొంపును, నహంకృతి యేర్పడ ద్రౌపదీసుతు
ల్వీరల మీఱి పొల్చెనఁగులీలయుఁ జూడుము సూతనందనా! ౧౨౫

వ. 'పాండవులు ధర్మపరు, లెవ్వలన ధర్మంబు గలుగు నవ్వలనికి జయంబు గలుగుట దప్ప'దను సమయంబున; సంశప్తకులంబు గనుంగొని మనసైన్యంబును నవ్య

* చిన్నచిన్నమాటలతో జరిగేయుద్ధమును కన్నులకుగట్టినట్లు వర్ణించు యీ నేర్పు తిక్కన పలుతావుల ప్రదర్శించును. జనసమర్దములో, తుములసంగ్రామమున దూరమునకు కనుపించేది కేతనమే గదా. దానిని ఆనవాలుబట్టి ఆ ధ్వజవిహారమున్నచోటుకుపోయి, ఆ వీరునితో యుద్ధముచేయ నుద్యోగించుటను సహజముగా సొంపుగా యీ రణరంగమున వర్ణించుచుండును. ఇదేపద్యము మరల ఇదే ఆశ్వాసమున 152-వ పద్యముగా నున్నది. ఇది యూనివర్సిటీ సంశోధకులు గమనించినట్లు లేదు. ఏమో అట్లే ఉంచినా.

సాచిం జూచి వారిసేనయును గడంగి యొండొంటితోఁ దాఁకిన, గంగాయమునల సంపాతంబుచందంబు దోఁచె। నట్టియెడం గురురాజు రాధేయుని మద్రరాజుం దగురాజులను సాదరావలోకనంబున సంభావించి యిట్లనియె:- ౧౨౬

—♦ కురురాజు నిజసైన్యమును బ్రోత్సాహపరచుట ♦—

ఆ. 'ఎద్ది ప్రియము సేయు నేపారుశూరుల
చిత్తములకు, నది యుదాత్తభంగి
నొదవె మీకు। బాహుమదమునఁ గొనియాడుఁ
డుగ్రశౌర్యమహిమ యుల్లసిల్ల. ౧౨౭

క. 'బలుపెసఁగ బాండుపుత్రులఁ
బొలియించిన నతులరాజ్యభోగంబును; వా
రలచేతం బొలిసిన మ
జ్జ్వల నాకసుఖంబు గలుగు; వ్రాలుఁడు పోరన్.' ౧౨౮

వ. అనిన వార లందఱు నుబ్బి సింహనాదంబులు సేయఁ, దూర్యనినదంబులు చెలంగ, సైన్యంబులు సంతసంబునం బొదలె, నప్పు డశ్వత్థామ రథికజనంబుల మనంబులం బ్రమదం బెసంగ నిట్లనియె:- ౧౨౯

క. 'ఆయుధము విడిచి యుండఁగ
సాయకగురు మీరు సూడఁ జంపిన కష్టో
పాయుని ధృష్టద్యుమ్నుని
మాయించియ కాని తొడిగినమఱు వే నూడ్పన్. ౧౩౦

క. 'కడువడి నడముడియును గ
వ్వడియు నతనిఁ గావఁ బూని వచ్చిరయేనిం
జెడుదురు మచ్చాపంబున
వెడలు వివిధవిశిఖశిఖల వేఁడిమిచేతన్.' ౧౩౧

చ. అని విని, యవ్వరిష్ఠరథికావలి పెల్లుగఁ బాండుపుత్రయో
ధములనయిన వైనం గనియు దర్పము, వార లుదగ్రవృత్తి మా
ర్కొనిన మహోగ్రభంగియును, ఘోరపుశీలల విస్మయం బొన
ర్చె ననిమిషాంతరంగములఁ। జెల్లె రణంబు సుదీర్ఘరౌద్రమై. ౧౩౨

క. జవనంక్షయంబు పెల్లే
మన వచ్చుం? బ్రళయకాల మయ్యెనొ? కాకెం
దును నిట్టివి గలవె? యని.
మనములఁ దలపోయ వలసె మముబోఁటులకున్. ౧౩౩

వ. అట్టియెడ : ౧౩౪

ఉ. ప్రీతి యెలర్ప వీరుల వరింపటకుం జనుదెంచి, యప్సరో
వ్రాతము గంధపుష్ప పరివర్షణకేళి యొనర్ప, బౌరథం
బాతతి సంచరించు లలితానిలుఁ డెక్కుడు నేపి వీచె, సం
జాత నవీనఘర్మజలజాలక సైనిక లాలనీయుఁ డై. ౧౩౫

ఉ. ఆనయమునం గురుకులాగ్రణి భీమునిఁ దాఁకె; వైరిసం
త్రాసద మత్తవారణ కదంబసముద్భటుఁ డై యతండునుం
జేసె రణంబు, తత్ప్రబలసేన దలంకెడునట్లుగా సము
ద్భాసిత దుర్నివార్య బహుబాణ విసారణ దారుణోద్ధతిన్. ౧౩౬

—◆ ఉభయబలంబుల సమరసన్నాహము ◆—

క. పదపడి రాధేయుం డు
న్మదవృత్తిం గవిసె, గుణనినాదంబును బె
ట్టిదమగు రథనిస్వనముం
జదల వినఁబడఁ బాండవాగ్రజన్ముని దెసకున్. ౧౩౭

వ. ఇట్లు గవిసిన, మనసైనికు లిట్లని: 'ఇవ్విధంబున ధర్మనందనుం గదియ నడరిన,
నరుండు వచ్చి యుద్ధంబు పొచ్చునపుడు : ౧౩౮

చ. 'నరునకు సూతసూతికి రణం బగు నేఁ డతి ఘోరభంగి; నం
దరయ నితండు గీటడఁచు నాతని నన్నటు లున్నవాఁడు, దు
ర్భరరిపుబాధ దక్కి కురురాజు సుఖిత్వముఁ బొందు నిప్డు; రం
ధరదము పేరి యాతనిమహాస్త్రవిలాసము సూత మేర్పడన్. ౧౩౯

క. 'గెలు పెల్లభంగి నితనికిఁ
గలుగు ననుతలంపు పుట్టెఁ గా, నిప్పుడు మనం
బుల జనియించు మనోరథ
ఫలవడుటయొ, వీర నెఱుఁగనయ్యెడు నదియున్.' ౧౪౦

వ. అనుచు గూడుకొని, రథ కరి తురగ సమ్మర్ద విర్దళితభూభాగంబుగా మరవడింప రాధేయుం డరిభీషణం బగురణంబున, ౧౪౧

తే. మిగిలి, యప్పాండవాగ్రజు మగఁటిమియును
జలముఁ గోల్పుచ్చి, తూలఁ దోఁ బలికి మెఱపె
నధిప, యతనికి వేఁకమై నడ్డపడఁగఁ
గడఁగు నద్దెస యోధుల గర్వ మడఁచి. ౧౪౨

వ. అనిన విని, సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియెఁ:-'కర్ణుండు దనమొన యె ట్లాయితంబు సేసెఁ? గౌంతేయ ముఖ్యసైన్యసన్నాహం బెట్టి, దతం డతనిం బొదివినయప్పుడు గవ్వడి యెవ్వలన నుండెఁ? నవ్వీరుం డన్నకడమున్న, నా సూత నందనున కిట్లు సేయ వశంబగునే? వాసవుండు సకలసురగణంబులతోఁ బన్ని, యన్నరునిపై వచ్చి ఖాండవంబు గాల్పకుండఁ గావం జాలెనే? బ్రదుకున కాస వడు మగల కతని మాఱ్కొనవచ్చునే రాధేయునకు వచ్చుంగాక' యనుటయు;

తే. ఇట్టు లను సంజయుం డమ్మహీశ్వరునకు-
'నంగిపతి మోహరంబు తెఱంగు ధర్మ
సుతుని యొద్దువిధంబు, నర్జునుఁడు వారి
పోరునెడ లేమియును; మీఁదిపోరు వినుము:- ౧౪౩

వ. కృపాచార్యుండును గృతవర్మయు మాగధులు వలపల, శకునియు నులూకుండును గుఱ్ఱపుదళంబులతో వారికెలనను, సంశప్తకగణం బిరువదినాలుగువేలు రథిక ముఖ్యరథంబు లగ్గలిక నుల్లసిల్లి దాపలను, నీ కొడుకులందుఁ గొందఱు కాంభోజ శక యవన సైన్యసమేతంబుగా వారి యవులను, బహుబలభాసితుండై దుశ్శాస నుండు వెనుకనుం, గతిపయ సోదరపరివృతుండై కురురాజటి పిఱుందను, నశ్వ త్థామప్రముఖ యోధులు గరి నికర కృతసన్నాహులై యన్నరపతి నియోగింప నతనిపజ్జ నిలువ, *నిజపుత్త్రులుఁ దనచుట్టునుం గడిపి యెసక మెసఁగు, బరవశం బున మెఱయ, సూతసూనుండు సేనాముఖంబునకుం దిలకంబై నిలిచి పొలిచె:

* కర్ణునిపుత్త్రులు - సుషేణ, సత్యసేన, చిత్రసేన, వృషసేనులనువారు. వీరు తండ్రి చక్రరక్షకులుగా ఎప్పుడు దగ్గరనేయుండి యుద్ధము చేయుచుండిరి. ప్రసేనుఁడుగూడ కర్ణుని కొడుకు అని చిత్రశాలా ప్రతియందును గలదు. (కర్ణ-వ: 3-18) వికర్ణుఁడు కర్ణునిపుత్త్రుఁడు గాఁడు, ధార్తరాష్ట్రుఁడు. ఈ వర్వములో (1-ఆ. 169-172) పార్థునిచే తుదముట్టింపఁబడిన సత్యసేనుఁడు-త్రిగర్తాధిపతి సోదరుని సుతుఁడు.

నట్లు మోహరించి మదకలమాతంగంబుల తఱచుకతంబున మొయిళ్ళ మొత్తంబుల కైవడిం గాఱుకొను నమ్మొన నురవడి నడిపించు నా కర్ణునిం గనుంగొని కౌంతేయాగ్రజుండు గాండీవి రావించి యిట్లనియె :— ౧౪౫

ఉ. 'సూతతనూజు మోహరము సూచితె? యెంతయు గట్టి యై సము
ద్ద్యోతితభంగిఁ దోఁచె; నది యుక్కునఁ బైపడి యిబ్బలంబు వి
ర్ధూతము సేయకుండఁగ నెదుర్కొని, యెమ్మెయి నిల్వరింత మ
న్నీతి విధింపుమా బలుపు నేర్పును దజ్జులు పిచ్చలింపఁగన్.' ౧౪౬

వ. అనుటయు సంక్రందన నందనుండు, ౧౪౭

తే. 'సారవంతమై కర్ణునిసైన్య మురవ
డించుఁ గా కేమి దీనికి? నృపవరేణ్య,
పూని చేయంగవలయుఁ బ్రధానకార్య
మతని నమయించుటయ; నాకు నది భరంబె?' ౧౪౮

వ. అనిన విని, యమ్మనుజపతి యతని కిట్లను: 'నట్లేని నీవు రాధేయుని గెలువుము. భీమసేనుండు సుయోధనుని, నకులుండు వృషసేనుని, సహదేవుండు సౌబలుని, శతానీకుండు దుశ్శాసనుని, సాత్యకి గృతవర్మను, ధృష్టద్యుమ్నుండు ద్రోణపుత్రుని, ద్రౌపదేయులు శిఖండియుం దారును దక్కటి ధార్తరాష్ట్రులం దలపడువా; రేను గృపాచార్యునితోడం బెనంగెద ననుటయు, నట్ల కాక యని, యతండు మున్ను దన నిలిచిన నెలవునకుం జనునెడ, నయ్యుధిష్ఠిరు పనుపుతెఱంగు వార లందఱకు నెఱింగించె. నతండు వలపటివలన సైన్యాగ్రవర్తి యయ్యెను, వృకోదరుండు వామపార్శ్వవర్తి యయ్యెను, శైనేయ ద్రౌపదేయసమేతంబుగా నప్పాండవాగ్రజుండు మధ్యభాగస్థుం డయ్యె నున్న, యమ్మోహరం బా సూతనందను మొనయురవడి సరకుగొనక మార్కొనియె; ననవుడు నాంబికేయుండు— ౧౪౯

మ. 'నరుఁ డమ్మై విని వచ్చె, నన్నరునకు న్సంశప్తకశ్రేణికి
స్థిర మత్యద్భుతభంగిఁ జెల్లుటయు మున్సూచించితి; వయ్యుధి
ష్ఠిరునిం గర్ణుఁడు దాఁకి యోర్చె ననియుం జెప్పంగ వింటిన్; రణం
బరయం జిత్రము; సెప్పు మత్తెఱఁగు సువ్యక్తంబుగా సంజయా.' ౧౫౦

వ. అని యడిగిన, సంజయుం డమ్మానవపతి కిట్లను:—నట్లు ధర్మజుండు సెప్పె కాని యయ్యిరువాఁగుం గవిసినప్పు డన్నియమంబు నడపక, కయ్యంపు టౌచిత్యంబున

నొండుఁదెఱంగు సెల్లె; నది యెఱింగించెద నవధరింపు: మద్విధంబున మొనలు రెండును నొండొంటిం దార్కొనుసమయంబున సవ్యసాచి గర్జు నడచు చక్కటికి నడరం గడఁగిన గ్రాలు కపికేతనంబు గనుంగొని, తెంపుపెంపునఁ బొంపిరి వోవుచుఁ ద్రిగర్తాది సంశప్తకులు సరభసంబుగా నడ్డపడి, పైకొని తఱిమి, పొంగిన పయోనిధిం బోలిన నబ్బలియుండు వెలియలికట్టం బోలి నిలువరించి, మాతంగప్రముఖ సేనాంగ సకలాంగ శకలంబుల నిలాతలంబు గప్పుచుండ, నొండొండ పేర్చి యాబలం బాబలమర్దన నందను సరదంబు ముంచికొనిన, నవ్వీరుండు విజృంభితవిక్రముండై బడబాగ్ని కీలాకలాపంబు చందంబగు సాయక నికాయంబు నిగిడించుచు, నెక్కుడు మదంబున నమ్మూఁకలం ద్రెక్కొనుచుండఁ; దత్ప్రకారం బాలోకించి రాధేయునకు శల్యుం డిట్లనియె:- ౧౫౧

ఉ. *'అల్లదె! యర్జున ధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపిం
ద్రోల్లసనంబునన్ మెఱసి! యుద్భటులై నత్రిగర్తు లేపు శో
భిల్లఁగ వారె! యన్నరుని బెట్టుగఁ దాఁకి, రతండు వంపపె
న్వెల్లి నిగిడ్చి ముంచె నదె! వింటి గుణధ్వని వొంగ వారలన్.' ౧౫౨

వ. అని చెప్పుచూపెఁ. బదంపడి భారద్వాజపుత్రుని బరవసంపుమాటల నాటోపంబు మిగిలి, మనరథికులు గవిసిన దారుణరణం బయ్యె నని, యాకర్ణించి తది యేర్పడ వినుము వివరించెద. ౧౫౩

సీ. కృపుడు సౌబలుఁడును గృతవర్మయును నలిఁ
జెలఁగు మూఁకలతోడ బెబుచఁ గవిసి,
కాశ కైకయ మాత్స్య కౌసల పాండ్యాది
బలములఁ దాఁకి రగ్గలిక మెఱయ,
నారెండువాఁగుల నాయుధంబుల యెఱ
మంటలఁ బొల్లను మింటఁ బడమిఁ
జూడ నక్కజముగ, శోణిత ధారలు
ప్రచురధూళీతిమిరముల నడఁప,

తే. భగ్నరథములు నిపతితేభములు విహత
హయములును మృతభటులును రయమునకు వి

* ఇదేపద్యము, యీ ఆశ్వాసమునే 120-వ పద్యంగా నున్నది.

ఘాత మొనరింప, మమ్మద గమనభంగు
లందు నెరవులు మెఱయఁ బోరాడి రథిప. ౧౨౪

వ. ఆలోన. ౧౨౫

—♦ కర్ణుఁడు పాంచాలకుమారుల పైఁబడి అనేకుల తుదముట్టించుట ♦—

ఉ. మేలి మదావళంబులును మేటిహయంబులుఁ దమ్ము పిండు నా
భీలతఁ జుట్టి రాఁగ, రథబృందముతోఁ గురురాజు కర్ణుదో
ర్లీలకుఁ దోడ్పడం గడంగె; రేణు వుదీర్ణముగా నతండు పాం
చాలబలంబుపై నడరె శౌర్యసముద్ధత బాహువీర్యుఁడై ! ౧౨౬

వ. అబ్బలంబునకు బాసటయై చేదిసైన్యంబును, బెనుఁ బ్రాపై పాండవానీకంబునుం దఱిమినఁ, బెఱిగినదర్పంబునం బ్రదీప్తుం డయి యక్కర్ణుం డా గట్టిమూఁకలం దఱిమి, మెఱుంగువాలమ్ములు వఱప, నవి పీనుంగుపెంట లగుచుండ మఱిత యుక్కునం బొదివిన బలుమగలకుం గీర్తియు స్వర్గంబును నొసంగి, తమవారి కంటెం బ్రమోదభరితులం జేయుచు, సాయకాసారంబులు వరఁగించుచు బహువిధరథప్రచారంబు లుల్లసిల్ల; నాసేనలును గృప కృతవర్మాది యోధబృందంబులతోఁ బెనంగుమొనలును నొక్కటిగాఁ గలంచి, యందు శోణితజలంబును. మాంస మజ్జామస్తిష్క కర్దమంబులను, బతితాతపత్ర హంసంబులనుం బొలుచునట్టి నదీప్రవాహంబులు వఱపె। ననుటయు, ధృతరాష్ట్రుండు 'ధర్మనందనుం గర్ణుండు గదియునప్పు డతని కక్కడ నడ్డపడుట కెవ్వరు గడంగి? రిక్కడ నితనికిఁ దోడ్పడ నెవ్వారు గలిగి?' రనుటయు సంజయుం డవ్విభున కిట్లనియె:—

తే. ఇవ్విధంబున సేనల గ్రొవ్వడంచి
సూతసూనుండు ధర్మజు కేతనంబు
దెనకు నడర ధృష్టద్యుమ్నుఁ డెసక మెసఁగ
బంధులును దాను వడి నడ్డపడియె నధిప. ౧౨౭

క. వారలఁ గడచి ప్రభద్రకు
లారాధేయునయఁ గవియ, నాతండు మహో
దారుల నేడ్వుర భద్రా
కారుల నారాచసప్తకంబునఁ గూల్చెన్. ౧౨౮

క. కని పాంచాలురు గోపం
బున దర్పము నెఱయఁ మెఱయఁ బొదివిన, రాధా

తనయుం డిరువదియేవురఁ
దునిమె నిరువదేను వెసఁదతూపులఁ బెలుచన్. ౧౬౦

క. వెండియు నేపునఁ బైకొని
చండశరప్రకరములు వెనం గురియఁగ, మ
ద్దండతఁ బాంచాలురఁ గ
ర్ణుం డేవురఁ జంపె నైదు క్రూరాస్త్రములన్. ౧౬౧

వ. ఇట్లు భామదేవ చిత్రసేన సేనాబిందు తపన శూరసేనులం గీటడంచి, యాటోప దీపితుం డయి చక్రరక్షకు లగు సుషేణ సత్యసేనులు వెనుక బలసి వచ్చు వృషసేనుండు విమ్మువ్వురుగొడుకులఁ గడిమి రూఢి కెక్కం, దనకు రణక్రీడకుం దోడుపడియెడు నుల్లాసంబున నుల్లంబు పల్లవింపం, బాండవబలంబులం గలంచు నయ్యంగపతిమీఁద ధృష్టద్యుమ్న శిఖండి జనమేజయ ప్రముఖపాంచాల కుమారులును, సాత్యకి నకులసహదేవ ద్రౌపదేయులును, గేకయ మాత్స్యయోధవీర వ్రాతంబును భీమసేనపురస్సరంబుగాఁ దోతెంచిన, బహుళజలధరంబులు ధరణీధరంబుపయిం గురియు పెనుసోనచందంబు దోఁప, వివిధాస్త్రశస్త్రంబు లతని పయిం బొరఁగింపం గనుంగొని, కౌరవేశ్వరుండు దుశ్శాసన శకుని తదీయ తనయులు దన కెలంకులం దఱుమం, గరిఘటలతోడం గడంగి, యవ్వడముడిని మార్కొని: ౧౬౨

క. తామును వారును దూపుల
వాన పయిం గురియ, నతఁడు వారించి గళ
ద్దానంబు లోలమధుకర
మైన గజవ్రజముఁ బటుశరార్చులఁ బొదివెన్. ౧౬౩

క. పొదివెడునప్పుడు శౌర్యో
న్మదుఁడగు నయ్యనిలతనయు మార్గణములు బె
ట్టిదముగఁ గవియుడు, నోటఱి
యెదురుప లేరైరి కురునరేంద్రుఁడు వారున్. ౧౬౪

మ. బలుగాలిం నలుదిక్కులం జెదరు నభ్రశ్రేణి చాడ్పున్సము
జ్జ్వల సూర్యాంశులచేత విచ్చు నిబిడధ్వాంతంబు నందంబుఁ, జూ
డ్కులకుం దోఁచెఁ బ్రచండ సంగర పటిష్ఠుండైన యాభీము తూ
పులమొత్తం బడరం, గరిప్రకర ముద్భూతార్తియై తూలినన్. ౧౬౫

—♦ కర్ణనందనుల విజృంభణము, అందు సత్యసేనుని వీరమరణము ♦—

వ. అట్టియెడం, గృపప్రముఖ రథికులు రాధానందన భవన్నందనులకుం దలకడచి, పవననందను పార్శ్వంబులం దఱుము ధృష్టద్యుమ్నాదియోధులం దలపడిరి. దుశ్శాసన ప్రభృతులును వారిం గూడికొనిరి. కర్ణనందను లక్కుఱ్ఱమర్దనుం దాఁకి, రందు సుషేణుండు, ౧౬౬

క. ఖరభల్లంబున నాతని
శరాననము ద్రుంచి, నారసములు రయమున్మై
నురమున నేడు సొనిపి, వి
స్మరవినదం బెనఁగ నార్చె మరలు నుతింపన్. ౧౬౭

సీ. కనలి, యొండొకవిల్లు గొని కీచకాంతకుఁ
డక్కుమారుని చావయుష్టి విఱుగ
నేసి, మై బల్గూపు లీరేడు నాటించి
త న్నష్ట దొడరు రాధాతనూజు
నుబ్బ వాలమ్ములు డెబ్బదిమూఁట వా
రించి, తత్పుతుఁడు దోర్లీల మెఱయఁ
జేరిన, నా సత్యసేను రథ్యంబుల
సూతుఁ గార్ముకమును గేతనంబు

తే. నేడు తూపులఁ దునుమాడి, యేచి మూఁడు
నారసము లంగమునఁ గ్రుచ్చి, నాశమునకు
వికసితాంభోరుహముఁ బావు వెరవు దోఁపఁ
దునిమె పెనఁ గత్తివాతియమ్మున శిరంబు. ౧౬౮

—♦ సుషేణ భీమసేనుల పోరిలో కర్ణుఁడు సకులుఁడు బోరబడుట ♦—

వ. తునిమి, దోస్సారంబు దుర్వారంబుగా నుక్కునం దక్కుటి రథికజనంబులవయి నడరి, కృప కృతవర్మాది రథికవరుల కోదండంబులు దుండంబులు సేసి, వారిం గ్రూరమార్గణంబుల మర్దించి, దుశ్శాసనుని సాయకత్రయంబునను, సౌబలునిఁ దద్ద్విగుణబాణంబులను స్రుక్కించి, యులూకుని నతనితమ్ముని నొక్కుమ్మడి విరథులం గావించి, కర్ణుకొడుకుం గనుంగొని: 'యోరి సుషేణా, పొలిసితి పొమ్మ'నుచు బలువారసంబు వీగిడించిన, నది నడుమన కర్ణుండు నఱికి, మెఱుంగు

టమ్ములు మూఁడు మేనం బఱప నలుక, మఱియు నట్టిమార్గణం బుక్కుమీఱు నుపలక్షించి యేసిన నా సూతనందనుం డదియును ద్రుంచి, యవ్వాడముడిమీఁదఁ ద్రిసప్తతితీవ్రప్రదరంబులు పరఁగించె. నప్పుడు నకులుండు గవిసిన; ౧౬౯

ఆ. చిత్రచాపముక్త శితశరపంచకా
హతశరీరుఁ జేసె నా సుషేణుఁ,
దేచి నకులుఁ డతని విరువదియమ్ముల
నొంచి, కర్ణుమనము నొవ్వ నార్చె. ౧౭౦

వ. అలిగి సుషేణుఁ డెంతయు రయంబునఁ దొమ్మిది దొడ్డవాఁడితూ
పులు మెయిఁ జొన్పి, విల్ దునిమి పొంగిన, నొండొకదీర్ఘచాప మ
గ్గలిక దలిర్ప నెత్తి, వెసఁ గార్ముకదండము ద్రుంచి నొంచె దో
ర్బలవిభవం బుదాత్తముగఁ బార్థునితమ్ముఁడు మాతు నాతనిన్. ౧౭౧

ఆ. అన్యచాప లసితహస్తుఁడై కడఁగి సు
షేణుఁ డతని షష్టిబాణగాఢ
విహతదేహుఁ జేసె సహదేవుఁ డడరిన
మేటితూపు లేదు మేనఁ గ్రుచ్చె. ౧౭౨

— వృషసేనుఁడు సాత్యకితోఁ దలపడుట —

క. అయ్యారువురు నట్లాలుని
కయ్య మమరదైత్యరణము కరణి మహోగ్రం
బయ్యె; వృషసేనుఁ డత్తఱి
నియ్యని సాత్యకి నెదిర్చె నిషుచయ మడరన్. ౧౭౩

సీ. సాత్యకి వృషసేను సప్తతి మార్గ
ణంబులఁ బొదివి, బాణత్రయంబు
సూతుమైఁ బఱపిన, నాతఁ డాతని పెనుఁ
గడఁత వాలికయమ్ము గాఁడ నేయఁ,
గోపించి మూఁడుబల్లూపుల సారథి,
నొకభల్లమున విల్లు, పజ్జ్వలాస్త్ర
సప్తకనిహతి నశ్వంబుల, నేకకాం
డస్ఫూర్తిఁ గేతుదండంబుఁ దునిమి,

క. అలిగిన యన్నరనాథుని
కెలఁకుల వెసఁ దఱిమి, కర్ణ కృప కృతవర్మల్
బలుతూపుల నేయఁగ న
న్నలువురఁ ద్రుక్కించె నతఁడు నారాచములన్. ౧౯౧

తే. దొరలఁ గడఁచి బలంబు లుద్ధురత నిగుడ
వారిమొనలు నెదిర్చిన, ఘోర తుముల
సంగరం బయ్యెఁ; న య్యవసరమునందుఁ
దాఁకె దుశ్శాసనుఁడు వాయుతనయుతోడ. ౧౯౨

— భీముఁడు దుశ్శాసనుఁడు తలపడి పోరుట —

తే. సారథుల యుబ్బు వాజుల చటులతయును
మెఱయ నొప్పారుతేరులమీఁదఁ బొలిచి
రపుడు గయ్యంపువేడుక, నాతఁడును న
తండుఁ జూపఱ కన్నులపండు వగుచు! ౧౯౩

క. ఒండొరులమీఁద నుజ్జ్వల
కాండము లడరించు చట్లు గదిసినయెడ, భీ
ముండు ప్రమోదభరిత చి
త్తుం డయి, తగవిట్టు లనియె దుశ్శాసనుతోన్:- ౧౯౪

ఉ. 'ఆ సభలోనఁ గొన్నఋణ మంతయు నీఁగఁగఁ గంటి వద్దితో!
బాస కొంకితయుం దొలఁగఁ బాఱక తీర్చెద నిష్ఠ నేఁడు! నా
చేసినపుణ్య మెవ్వరును జేయరు; ని న్నిటు పేరఁ దెచ్చుటం
జేసి విధాత నాకుఁ గృప సేయుట గానఁగ వచ్చెఁ దమ్ముఁడా! ౧౯౫

వ. అనిన విని, యతఁ డతని కి ట్లనియె:- ౧౯౬

సీ. 'ఎఱుఁగుదు! మఱచితినే లక్కయింటఁ జి
చ్చిడి మిమ్ముఁ బఱచినయిడుమ! లనియుఁ
గాకయు, నమ్మెయి గాంధారరాజు మీ
యన్నతో వెడజూద మాడి రాజ్య
లక్ష్మిఁ జేకొని కావలకుఁ బోవ నడిచితి;
మందుఁ బెక్కాపద లనుభవించి.

యజ్ఞాతవాసార్థ మవ్విరాటుని ప్రోలి
కరిగి యత్యంతదైన్యంబు నొంది.

ఆ. యట్లు మీర లవికి యప్రసిద్ధమె? యివి
యేల రిత్తమాట లేటువోటు
తలఁకు వచ్చె?' యనుడు; *దరహాసమునఁ గెంపు
గదురఁ బవనసుతుఁడు గడఁగి డాపి. ౧౯౭

క. భల్లములు మూఁట సిడమును
ద్రిల్లు పఱిచి, సూతకంఠ విదళనమున తో
ఖిల్లి, విటలమునఁ బటు ద
ర్పోల్లసితుం డగుచు నాటె నొక నారసమున్. ౧౯౮

వ. దాన భీముఁ డొవక దుశ్శాసనుండు; ౧౯౯

క. తురగములఁ దావ నడపున
వెరవు రయము మెఱయ నొందువిలు గొని, గాఢ
స్ఫురణమున భీముతనువునఁ
బరఁగించె మెఱుంగు లడరఁ బంఁడ్రెం డమ్ముల్. ౨౦౦

క. తోడన కోదండము దున
మాడెను. సూతుమెయిఁ గ్రుచ్చె నాఱమ్ములు. నం
క్రీడయవోలెను మువ్వది
యాడించెను మఱియుఁ దూపు లనిలజు మేనన్. ౨౦౧

మ. ధను వొం డుగ్రత నెత్తి. యేఁబది శితాస్త్రంబుల్ మరుత్సూనుఁ డా
తవిగాత్రంబునఁ గ్రుచ్చినం. గినుకమై ధైర్యంబు శౌర్యంబు నొ
ప్ప నతం డజ్జ్వలభల్లయుగ్మ యుగళస్ఫారాహతిన్ వాజులం
దునిమెం, జాపము పిచ్చలింప విలసద్దోర్గర్వదుర్వారుఁడై. ౨౦౨

వ. ఇట్లు విరథుండై వృకోదరుండు మెయి వెంచి; ౨౦౩

మ. గద లీలం గొని తేరు డిగ్గి, మెఱుఁగుల్ గ్రమ్మంగ సారించి యు
ద్ధృదయానంబునఁ గిట్టి, ఘోటకములన్ బ్రమందించి. బాహాబలం

* ఇచట భీముఁడు పలికినమాటలు భండార్కర్ ప్రతియందు లేవు; కుంభకోణపు ప్రతియందు గలవు. ఇట్లే చాలభాగములను తిక్కన ఈ దక్షిణప్రతినుండియే తీసికొనినాడు.

బు దలిర్పఁగా భవదీయసూను నరదంబుం ద్రెళ్ళఁ ద్రోవంగ, బె
ట్టిదపుం దోమర మెత్తికొం చతఁడు దాఁటెఁగా నేలకుఁగా గ్రక్కునన్. ౨౮౪

వ. అట్లు దాఁటి, కట్టుపైచిన యత్తోమరంబునం గాఢ నేచి, యక్కీచకారాతి పదు మూఁడువత్సరంబులు దమపడినపాట్లును బ్రతినచందంబును డెందమున నావహిల్లి, మద్దండ గదాదండంబున దుశ్శాసను వైవ నతండు తద్ఘాతంబున నెత్తురు దొరఁగ ధరణిం బడిన, బెబ్బులి లేడికొదమం బొదువుపోలికం బొదివి మెడ సిక్కం ద్రొక్కి యెక్కుడుమదంబున నక్కుమారునితో ని ట్లనియె:- ౨౮౫

క. 'మును సభఁ బలికినదానం
దని నోవక యిచ్చటికి వచ్చితి? యే
మనియె దనుము! నీమాటలు
వినుటకు నాకినుక సాల వేడ్కపడి యెడున్.' ౨౮౬

వ. అని, యమ్మహాబలనందనుండు మహోగ్రలోచనప్రభలు నిగుడ మన బలంబులం జూచిన, ౨౮౭

క. నిగుడు దవాగ్ని జ్వాలల
వెగడందిన మృగకులంబు విధమున, నతిభీ
తి గదిరి నలుగడ విచ్చిన.
జగతీశ్వర, యతఁడు మెఱసెఁ జక్కని బయలన్! ౨౮౮

వ. అప్పుడు నీయందుఁ జేయంగల సైనికుల సూచి, తత్తేజోవిశేషంబునం జూడ్కులు మిఱుమిట్లు గొన వెఱచఱచి, యంతంత ఁటప్పవడియుండ; ౨౮౯

—♦ భీమసేనుఁడు దుస్ససేనుని ఎదచీల్చి పచ్చినెత్తురు ద్రాగి
వికటస్ఫూర్తిని కలిగించుట ♦—

శా.* లీలం గేల నమర్చి మత్తగజ కేళీ సుందరోల్లాస మా
ఖీలత్వం బలరింపఁ ద్రిప్పి, జలదం బృథ్వీస్థలిఁగా వైచు, ముం
గాలం ద్రోచు, మొగంబు ద్రేయు, దెస లుగ్రస్ఫూర్తి వీక్షించు, మోఁ
కా లూఁదుం బయిఁ, గ్రమ్మఱంగ మెడ చిక్కం ద్రొక్కి విల్చిఁగా, నగున్!

వ. ఇవ్విధంబున ఘోరవిహారంబు సలిపి, భీమవిక్రముండగు నా భీమసేనుం డయ్యువ రాజునాననం బాలోకించి:— ౨౯౧

* ఆఖ్యాతకవి-2, అ-14-పద్యమునకుగల పాదాంకము, క్రింది 214; 217 పద్యములు జూడవగు.

క. 'ఏ నరము ద్రచ్చి నెత్తురు
తేనియ యిది ద్రావెదం; గదిసి వసుఁ గడిమిన్
మానప డిక్కఁగలిగిన ప్రాని
న్మాఱుఁగింపు మీమొనం గలవారిన్.' ౨౧౨

వ. అని పెలుచంబలికి, కఠారంబు వెఱికి యతనిమొగంబుమీఁద జళిపించి. ౨౧౩

మ. నరసింహుం డసురేంద్రు వ్రచ్చుకరణి, న్రౌద్రం బుదగ్రంబు గా
మర నత్యుగ్రతఁ జీరి, క్రమ్మ రుధిర మ్ముల్లాసి యై దోయిట
న్వెర వారం గొని త్రావు, మెచ్చుఁ జఱికి, న్మేనుం మొగంబుం భయం
కరరేఖం బొరయంగఁ జల్లికొను, నక్కౌరవ్యుఁ జూచుం బొరిన్; ౨౧౪

వ. ఇట్లు దారుణభంగిం బ్రతిజ్ఞాకరణపూరణం బాచరించి; ౨౧౫

తే. 'తల్లి చన్నులపా లేను ద్రావ నెట్టు
లాననే పలు తెఱఁగులతేనియలును;
ఖండశర్కరతోడి దుగ్ధంబు లనుభ
వింపఁబడవే; యవియు నింతయింపు గావు;' ౨౧౬

చ. అని యెలుఁగెత్తి పల్కి, నలి నాడు, మహోద్ధతిఁ ద్రుళ్ళు, నార్చుఁ, బె
ల్చన భుజ మప్పళించుఁ, దమపై నికుఱుం మనవారు రక్కసుం
డని వెఱఁగందువారు, గళితాయుధు లయ్యెడువారు, భీతి మూ
ర్ఛను బడువారునై రణవిరామముఁ బొంద నదోత్కటాకృతిన్. ౨౧౭

వ. వదంపడి. ౨౧౮

మ. *గద పేతం గొని, యంత్యకాల యమరేఖం బేర్చి, రక్తంబుచా
య దలిర్పం దను వుగ్రసుందరముగా నవ్వీరుఁ దేతెంచి, యా

---

* చచ్చినను దుస్ససేనునిపై భీముఁనికి కసితీరక, వికటస్ఫూర్తి స్ఫురన్మూర్తియై, తాక
వాడి, శపించి బీభత్సమును కలిగించుచున్నాఁడు. ఇది భీముని వ్యక్తిత్వము. కీచకు[illegible] చంపిన
ఘట్టము దీనికి ఎంతో కిత ఆనిపించుచున్నది. ఆయన ఎదలోని వగ వగగా రాజిరాజి గనగన
మండి ఇట్లు కార్చిచ్చు అయినది. తిక్కన, చిన్న తెనుగు పొడిమాటలతో సహజముగా
మాట్లాడికొనినట్లే చెప్పి, భీతిని కల్పించుచునే రమ్యతనుగూర్చి పాఠకు[illegible]కి వెగటు పుట్టించుట
లేదు. కాబట్టే కవితాశిల్పమున మొనగాఁడైనాఁడు.

కవిబ్రహ్మ, ద్రౌపదిని గడువరిగా, భీముని నిర్వ్యాతనవిధానమున క్రమమెరిగిన [illegible]గా
వైశిష్ట్యము పొంగారునట్లు సృష్టించినాఁడు.

న్మద మాతంగములీల దోఁప; మనసేనం బొల్పఱం దోలి వే
బొదివెం గ్రమ్మఱ దుస్ససేను వికటస్ఫూర్తిస్ఫురన్మూర్తియై. ౨౧౯

వ. చలంబు నెఱయ నతని కాలు గేల నమర్చి మొగంబు గనుంగొనుచు నక్కీచకవైరి యిట్లనియె:— ౨౨౦

క. 'ఏమిర పసు లని యార్వవు? నీ
మాటలు విలువఁబడియెనే? పసరమ, మి
మ్మేము మగుడ నిదె యార్చెద
మీమాటకు మాఱు పల్కరెవ్వరుఁ గంటే? ౨౨౧

ఉ. 'నెట్టన యగ్గినం దగునె? పిన్నమ ద్రోచుటయున్ విషాన్నముం
బెట్టుటయున్ మహాభుజగ భీషణదంష్ట్రలపాలు సేతయుం
జుట్టలుఁ బెద్దలుం దెలియఁ జూడ సభన్ నెఱిమాలి యిమ్మెయిం
దిట్టిన కోర్చు టెందుఁ గలదే? విను గెల్వరె చూడ మెవ్వరున్?' ౨౨౨

క. అని పలికి, క్రమ్మఱఁగ మన
మొనమీఁదన్ బ్రమరివాఱి, ముద్గర లలితం
బునఁ గేలు మెఱయఁ జని, తన
కన లడఁగక దుస్ససేనుఁ గనుగొని పలుకున్:— ౨౨౩

ఉ. [1]'సైరివడి నోమెఁ గాన ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి? యానఘం
దా వల దన్నఁ గీ డుడుగదా? పతి లేఁడనఁబడ్డ కాంత వేఁ
డీవు గనుంగొనంగఁ బతి యేత్తెఱ నొప్పెఁ? బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లుకామినులు పేద్పడి రిట్లపతిత్వదీనతన్. ౨౨౪

క. 'విను! మేను జేయఁ బూనిన
పనులం దొకటి గడతేఱెఁ; బాపాత్మ సుయో
ధనుఁ బొరిగొని తల దన్నుదు
నను రెండవపనియుఁ దీర్ప నరిగెద నెలమిన్.' ౨౨౫

చ. అని యెలుఁగెత్తి చెప్పి, యతఁ డాతని గీటడగించి యార్చెఁ; గ
ర్ణునకును లోనుగా మన వరూథినియోధులకున్ మహాభయం

1. ద్రౌపది.

బున మనముల్ గలంగఁబడి పోఁకి నూల్కొనపీని ఱిచ్చపా
టున సకలాంగకంబులు గడుఁ శిథిలంబులుగా మహోగ్రుఁడై. ౨౨౬

క. జనపతియుఁ గృప ప్రముఖులుఁ
గనుఁగొన, నిట్లనిలసుతుఁడు క్రౌర్య మొదల్ గై
కొనినట్లు పేర్చి దుశ్శా
సనుఁ జంపుటఁ జూచి, రోషసంరంభమునన్. ౨౨౭

వ. నీకొడుకులు—కవచియు నిషంగియుఁ బాశియు దండధారుఁడును ధనుర్గ్రాహుం డును నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుండును సువర్చసుం డును గూడి కవిసి, వివిధవిశిఖంబుల నతనిం బొదివిన; నంతకుమున్న దుశ్శాసన రక్తపాన కౌతుకాధీన మానసుండైన యా భీమసేనుపై నెవ్వరు గడంగుదురో యని కన్నిడి యుండి, యతం డప్రతిహతంబుగాఁ బ్రతిన దీర్చుటకుఁ బ్రీత చిత్తుండగు ఫల్గునుండు భల్లదశకంబున నక్కుమారదశకంబు శిరంబులు దును మాడె; నట్టి భీమార్జునుల యాటోపంబున కోటలి నీ సైన్యంబు సమరవిముఖం బయ్యె. నా సూతనందనుండును భీతుండై వదనంబు వెలవెలఁ బాఱ నూరకుండె. నప్పుడు శల్యుం డతని నాలోకించి యిట్లనియె:— ౨౨౮

తే. 'ఉగ్రుఁడై దుస్ససేనుని యురము వ్రచ్చి
రుధిర ముగ్రతఁ ద్రావు మరుత్తనూజుఁ
జూచి చేడ్పడి చెయ్వేదెఁ జూచితే సు
యోధనుని? నీవు నట్లైన నొప్పు నెట్లు? ౨౨౯

క. 'బలియురగు రాజులును గాల్
నిలువక తెరలంగ, వీరె నీప్రాపున శ
త్రులఁ దాఁక దలంచి కృపా
దులు నిలిచిరి! కూర్చికొను మతులధైర్యమునన్. ౨౩౦

—♦ కర్ణసూనుఁడు—వృషసేనుఁడు విజృంభించి అర్జునిచే హతుఁడగుట ♦—

చ. 'కడు వెగ డందియున్న నినుఁ గన్గొని వీఁడె! యుదారధైర్య మే
ర్పడ వృషసేనుఁ డొక్కరుఁడుఁ బాండుతనూజుల మార్కొనంగఁ బో
యెడు! నరు నీవు దాఁక వలదే? రణభారము నీభుజంబునం
ఒడియె సమస్తముం గురునరేంద్రుఁడు; దానిఁ దలంపు మిత్త్రతిన్! ౨౩౧

వ. అవిన విని, యతండు సమరోన్ముఖుం డయ్యె. వృషసేనుండు భీమసేనుపై పరవఱింప నకులుం డడ్డపడి, యక్కుమారుని పిడంబును గొడుగును గోదండంబును ఖండించిన; ౨౩౨

చ. అలిగి యతండు వేఱొకశరాసన మెత్తి, రథమ్ము ఘోటక
మ్ముల విలఁ గూల నేయఁ, బొలివోవని ధైర్యము పేర్మి వాలునుం
బలకయుఁ గొంచు, మాద్రితొలుపట్టి ధరిత్రికి దాఁటిబెట్టు గో
త్తిలఁ జవి తత్ప్రహాయభట దారుణకేళి యొనర్చి పేర్చినన్. ౨౩౩

ఆ. కర్ణసుతుఁడు పలక ఖండించి, కృష్ణస
ర్పంబుఁ బోవి పటు కృపాణ మురుక
వఱికి, నారసముల నాటించె నయ్యర్జు
నానుజన్ము మేన నల్ల నగుచు. ౨౩౪

వ. అప్పుడు ధృష్టద్యుమ్నుండు యుధామన్యుండును నుత్తమౌజుండును శిఖండియు జనమేజయుండును సాత్యకియు ద్రౌపదేయులును రౌద్రంబు శోభిల్ల రుద్రుల కైవడి వృషసేనుపయిం గవిసినఁ, గృతవర్మ కృప ద్రౌణి దుర్యోధనులును శకునియుఁ దత్సోదరులు గొందఱును గ్రందం దఱిమి, దుర్వార విశిఖవర్షంబుల వారలం గప్పినం గవి, గజసాధనుఁగు కుళిందు లరవఱించి. ౨౩౫

క. కృతవర్మ పిక్కువడ, భూ
పతి నేడ్పడ, శకుని వెగడుపడఁ, దదవరజ
ద్వితయము ధరఁ బడఁ, దీవ్రో
ద్ధతిఁ బోరిరి చాపటంకృతంబులు పెలఁగన్. ౨౩౬

వ. ఇత్తెఱంగునం బోరినం గనలి కడంగి, కర్ణుండు: ౨౩౭

క. ఆ ముయ్వురఁ జలమున ను
ద్దామద్విప సహితచిత్రదళనంబున సం
గ్రామతలము [1]రక్తాక్తం
బై మెఱయ బలాధిపత్రయముఁ బొరిగొనినన్. ౨౩౮

క. తక్కటి రథికజనులు పే
రుక్కున నయ్యుభయచయంబు నొదిఁగించియునుం

1. రక్తార్కంబై: రక్తార్ణవమై మెరయ.

జిక్కువఱచియుం దవిమియు
నెక్కుడు మద మొప్ప మెఱసి రిభపురనాథా। ౨౩౯

వ. మెఱసినం జూచి; ౨౪౦

ఆ. అరదమెక్కి తఱిమె నవిఁతనూజుఁ డ
వ్వీరుతోన పాండవేయసేనఁ
జేయఁగలుగు దొరలు శితశరాసారంబు
లదర వాఁమీఁద నడరుటయును; ౨౪౧

వ. రణంబు దారుణం బయ్యె. నందు, ౨౪౨

సీ. కర్ణుని యగ్రభాగంబునఁ గరిఘటల్
దునుమాడు నకులనందనునిఁ గిట్టి.
వృషసేనుఁ డమ్ములవెల్లి పైఁ బఱఁగించి
శితభల్లమున సూతుశిరము ద్రుంపఁ.
గనుఁగొని యక్కర్ణతనయుని మీఁదఁ బా
ర్థాదులు గవిసిన; నతఁడు పార్థు
ననిలజు మూఁడుమూఁ డమ్ముల నొప్పించి,
యాశతానీకుని నట్ల చేసి,
తే. నకులు తనువున బాణసప్తకము నొవిపి.
శార్ఙ్గధరుమేనఁ బండ్రెండు సాయకములు
పఱపి పేర్చినఁ, గౌరవప్రతతి మెచ్చి.
పార్థువేఁడిమి యూహించి భయముఁబొందె. ౨౪౩

చ. కెలఁకులయోధులం గడచి, క్రీడి వడిన్ వృషసేనుమీఁద న
మ్ములు విగిడింప; నారథికముఖ్యుని మూఁపున నక్కుమారుఁ డే
పలరఁగ వాఁడితూపులు రయంబుమెయిం బది బెట్టు గ్రుచ్చి. య
గ్గలిక ముకుందు నేసె నవకాండములన్ దివి ముట్ట నార్చుచున్। ౨౪౪

వ. ఇట్లు విజృంభించిన; ౨౪౫

మ. భ్రుకుటిస్ఫూర్జిత ఫాలభాగుఁడగుచుం బొంగారి, యాసూతపు
త్రకు కోదండము బాహుదండముఁ జిత్రస్ఫూర్తిఁ దన్మాడ్కి. మ
స్తక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్ల విలసద్ధారాహతిం ద్రుంచె. బా
లకశాదుర్దముఁ డన్నరుండు పఱియ న్రాధేయుఁడుం జూడఁగన్। ౨౪౬

—◆ కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము ◆—

వ. ఇవ్విధంబున వృషసేను సమయించుటం జూచి, కర్ణుండు శోకవ్యాకులచిత్తుండై కన్నీ రొలుకం, గోపాటోపంబున నుద్వృత్తుం డగుచు, నమ్మహారథుని తేరికి సమ్ముఖంబుగాఁ దనయరదంబు వఱపించి, 'యర్జున యర్జున' యని యాహ్వానంబు సేసిన; నతండును సవిశేషోత్సాహంబున బొదలి యడరె; నట్టియెడ దురంబు దక్కి యిరువాఁగునుం బరమకౌతుకంబునం గనుంగొనుచుండ నయ్యిరువురు రామసన్నిభంబులు నాదిత్యసంకాశంబులుఁ ద్రినయనప్రతిమంబులు నగు నాకారంబుల నుల్లసిల్లిరి. వారల యొక్కటికయ్యం బాలోకించు కుతూహలంబున సుర పితృ విద్యాధర సంయమిసంఘంబులును శచీపతి ప్రజాపతి పశుపతులును లోనుగా ననేకదివ్యు లేతెంచి నభోభాగంబున నిలిచి. రప్పుడు బ్రహ్మ రుద్రున కి ట్లనియె:- ౨౮౭

—◆ కర్ణార్జునులఁగూర్చిన బ్రహ్మరుద్రేంద్రుల సంవాదము ◆—

క. 'ఇరువురు నతిరథులు సమ
స్ఫురణులు విక్రాంతిపరులు శూరులు వీ రొం
డొరువులతోఁ బెనఁగఁగ న
శ్వర మగు జగ; ముడువరాదె సమరం బనఘా!' ౨౮౮

క. అన విని యాదేవుం డ
వ్వనజభవున కిట్టు లను:-'నవార్యోద్ధతు లి
ఘనభుజులు వీరిరణ మె
ట్లును జెల్లుం, దప్ప దప్పలుకు విను మింకన్.' ౨౮౯

వ. అని యిట్లమ్మహాత్ములు సల్లాపంబులు సేయ, నాకర్ణించి పాకశాసనుండు సప్రణయంబుగా బ్రహ్మ కి ట్లనియె:- ౨౯౦

ఉ. 'శమము సుదాత్తశౌర్యము మదగ్రబలంబును గల్గి క్రీడి క
య్యవువెర వెక్కుడై, గెలుచునట్లుగ నీవు దలంపవే? పురా
ణపురుషులైన కృష్ణుల రణంబున శాత్రవు లాక్రమించుటం
గుపితమనస్కులైన నిలుకుఁ బ్రదు కెమ్మెయిఁ గల్గనేర్చునే?' ౨౯౧

వ. 'నరనారాయణులకు నెందును జయంబు ధ్రువం బని తొల్లియుం జెప్పితి; రిమ్మహాత్ములు జయించుట లోకహితంబు. గర్ణుండు ద్రోణ భీష్మ ప్రాప్తంబైన పుణ్యలోకంబు వడయుఁ, గిరీటి చిరకాలం బిడుమలం బడినవాఁడు గావున రాజ్యసుఖంబు లనుభవించుం గాక' యనిన, నప్పరమేష్ఠి: 'వీరల జయాపజయంబులు నిశ్చయించి పలుకనేల?' యనుటయు, నీశానుం డతని నాలోకించి:— 'నిశ్చయించుట మేలకాక యెగ్గేమి? నిశ్చయింత'మని, కలిపికొని యతండునుం దానును వాసవువలను విలోకించి కృష్ణార్జునుల నుద్దేశించి— ౨౫౨

తే. 'మహితమునులగు మీ రెండు మాఱు లేక
మెఱఁగువారయి కాదె జన్మించినారు?
వినుము! నీ చెప్పినట్టుల వీరి నొరుల
ధిక్కరించుట లోకహితంబు గాదు. ౨౫౩

వ. 'వీరికి జయంబు ధ్రువం'బని పలికి, యంత నిలువక: 'వీరి జయంబు ధ్రువం బయ్యెడు' మనవుడు, నయ్యమరవిభుండు సురమునిప్రభృతులు గలయం గనుంగొని, 'దేవదేవు లిరువురు నేకమతంబుగా నిశ్చయించిన లోకహితంబగు నానతి యాకర్ణించితిరే! మీచిత్తంబు లిత్తెఱంగున కనుకూలంబులు గావలయు'ననిన, నందఱు: 'నది యిట్టిద కాక యొం డగునే?'యని; రనిమిషులు గుసుమవర్షంబులు గురియించుచు దివ్యదుందుభిధ్వానంబులు సెలంగించి. రయ్యవసరంబున నఖిలభూతంబులును విస్మయోత్ఫుల్ల నయనంబులగుచు నమ్మహాద్వంద్వయుద్ధంబు వీక్షించువేడుక నొందుదలంపులు దక్కి యుండె. రట్లు దార్కొనిన మహావీయరథంబులు రెంటియందును సన్నాహసముజ్జ్వలులై యొప్పు వాసుదేవార్జునులును గర్ణశల్యులును దమతమ శంఖంబు లొత్తి. రప్పుడు, ౨౫౪

తే. రెండుసేనల శంఖభేరీముఖంబు
లైన బహుతూర్యముల పటుధ్వాన మదరి
వింగి మ్రోంగారె; నత్యంతనిశ్చలంబు,
లయ్యె సైనికనికరంబు లద్భుతముగ! ౨౫౫

సీ. *కపికేతనము హస్తికక్ష్యయు నమ్మహా
బలు లిద్దఱును దపోబలమువలనఁ

---

* అర్జుని కర్ణుని కేతనములు రెండును, తపోబల బద్ధములైనందున కాబోలు, తమతమవారి పైఁ బడి పెనగుచున్నవి.

గన్నవియై, బుద్ధి గల్గి కోభిల్లు మ
 ద్రీశు; డప్పుడు కపి యెఱఁగి హస్తి
కక్ష్యపై నదరినఁ గయ్య మారెంటికిఁ
 గలిగె; నం దాహస్తికక్ష్య దెరలె,
నంబుజాక్షుండు మద్రాధినాథుండును
 దృక్కలహంబునఁ దేజరిల్లి

తే. రర్జునుండును గర్ణుండుఁ దర్జనంబు
లైనచూడ్కి లొండొరుల యాననములఁ
బఱపి; రాకృష్ణపార్థుల బలుపు, శల్య
కర్ణచిత్తదౌర్బల్యముల్ గానవచ్చె. ౨౩౬

వ. అట్టియెడ నాసూతనందనుండు మద్రపతి నాలోకించి:- ౨౩౭

తే. 'అర్జునుఁడు నన్ను నోర్చిన యట్టులైన
నెట్లు సెప్పుము?' యనుడు మద్రేశుఁ 'డేను
గృష్ణు లిద్దఱ నొక్కటఁ గిట్టి, తీవ్ర
బహుళ శరజాలముల పాలుపఱుతు' ననియె. ౨౩౮

ఆ. అట్ల సవ్యసాచి యడిగిన మురవైరి
నగుచు: 'నినుఁడు గూలినను ధరిత్రి
పఱియలైన మేరు వొఱగినఁ గర్ణుచే
నీవు గోలుపోవు టేల కలుగు?' ౨౩౯

వ. అని వెండియు: ౨౪౦

—॥ సవ్యసాచి సమరోత్సాహము ॥—

ఉ. అట్టిద లోకపర్యవస మాదురవస్థకు ద్రుక్కనేర్తునే?
కిట్టుదుఁ గర్ణశల్యులను కీటములం [1]గరతాడనంబులం,
బెట్టుదు నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు గాఁగ, ధర్మజుం
గట్టుదుఁ బట్ట' మన్న నగి, గాండివి యద్దనుజారి కిట్లనున్:- ౨౪౧

ఉ. 'నవ్వుల కంటెఁ గాక, యది నాకు నశక్యమె కర్ణశల్యులం
ద్రొవ్వడఁగింతు? చే ద్రుపదుకూఁతురు గొల్వునఁ బద్దపాటునన్

1. బదతాడనము.

నెవ్వగఁ బొందుచుఁ జూ సమయనిష్ఠ నడంగితిఁ గాని, యింక నా
మువ్వురుఁ బూని వచ్చినను ముట్టెదఁ, గర్ణుని నేలఁ బెట్టెదన్‌॥ ౨౬౧

మ. "అరదంబుఁ బిడముఁ హయవ్రజము శల్యాంగంబులుం జాపముం
గరకాండంబులఁ బెక్కుభల్లముల నుగ్రస్ఫూర్తిఁ దున్మాడి, వి
స్ఫురభల్లం బొకటఁ సుయోధనుని చూడ్కుల్‌ సీఱుగా విప్ర యు
ద్ధుర గర్వోన్నతమైన కర్ణుతలఁ ద్రుంతుం జూడుమీ వేడుకన్‌॥ ౨౬౨

ఆ. 'కర్ణ మద్రపతుల కాంతల విధవలఁ
జేయువాఁడ, నీవు పెన్ను మిగిలి
నగుచు, నేఁడు ద్రుపదనందన వీనుల
ధర్మసుతుని చెవులఁ దనుపు వినుపు. ౨౬౩

క. 'సంతసపువార్త పుచ్చుము
కుంతికి నే దంతి దరువుఁ గూల్చినక్రియ దు
ర్దాంతగతిఁ గర్ణుఁ గూల్చుట
యంతయుఁ గన్నారఁ జూచి యచ్యుత యెలమిన్‌॥' ౨౬౪

వ. అని పలికె. నాసమయంబున నుభయసైన్యంబుల జనంబులకు నంబరంబునమన్న దివ్యసమూహంబులు నంచు గీతనృత్తంబుల నుల్లసిల్లు నప్సరోగణంబులుం గాన నైన నద్భుతంబున వారు నవిమిషులై యుండి. రప్పు డేకనిశ్చయులగు కర్ణుండును దుర్యోధనుండును నచ్చెరువాటునం బొరయక, దురంబుమీఁది భరంబునం బొలిచి. రిరువాఁగు సైనికులు గిరీటిఁ గర్ణునకు నభిముఖంబుగాఁ దల మిగులఁ దగదను బుద్ధివి భయంబునను దద్రథంబులు రెంటివి బలపి నిలిచి. రమ్మహావీరులు ధనుర్ధృతులను బాణప్రభలను దీవ్రతేజంబులను బ్రదీప్తులై కల్పాంత సూర్యుల చందంబగుచు నొండొరుల నోర్చు కడంకలఁ బేర్చి. రయ్యవసరంబున నశ్వత్థామ గురుపతిఁ జేరం జని, కరంబు సేతం దెమల్చి సాంత్వన స్వరంబున ని ట్లనియె:— ౨౬౫

—◆ అశ్వత్థామ దుర్యోధనునితో సంధి జేసికొనమనుట ◆—

ఉ. కలన గురుండు భీష్ముఁడును గాండివిచేఁ బడి, రంగరాజు వా
రల కధికుండె? యాతని దురంబున నోర్వఁ గలండె? పూని యే
వల దని బుద్ధి సెప్పిన నవశ్యము నాతఁడు విల్చు; నీతనిఁ
బిలుపుము; నీవు ధర్మసుతునిం దగుమాటలఁ దేర్పఁ జొప్పడున్‌॥ ౨౬౬

వ. 'తెలిపిన దామోదరుండును దెలివి నొందు. ౨౨౮

క. 'భీముఁడుఁ గవలును ధర్మజు
చే మరలెడువార, లేను జెప్పెడిపలుకుల్
భూమీశ, కురుకులమునకు
నీ మొనరాజులకుఁ బ్రజకు హిత మూహింపన్. ౨౨౯

ఉ. 'వలవదు నన్నునుం గృపు నవధ్యులఁగాఁ గొని క్రీడి గెల్వ శ
క్తు లని తలంప; భీష్ముఁడును ద్రోణుఁడు లోక మెఱుంగఁగా నవ
ధ్యులు; హరికల్మి సారథికి దోర్బలలీల నడంగి పోరె, య
చ్చలమొ ఫలంబొ, యింకయిన సంధి యొనర్చుట మేలు వారితోన్. ౨౩౦

ఉ. 'హరి సనుదెంచినప్డు మన మమ్మెయిఁ బల్కితి; మింక సంధికి
న్వైర వగు వేళ గల్గు నని నీవు దలంపకు; మాంబికేయ భూ
వరుఁడుఁగ జేయు ధర్మజుఁ డవశ్యముఁ, బాండునృపాలుపాల యే
పురకు సమర్చుఁ గాని చనవున్ వెలిమెచ్చును నొల్లఁ డేమియున్. ౨౩౧

తే. 'పాండవులయట్ల రాధాసుతుండు నాదు
పలుకులకు నియ్యకొను, నీవు బ్రదుకు తెరువు
పట్టు. బ్రదికిన నెల్లశుభములుఁ గలుగు;
పీసు మానుము, చచ్చిన నేమి గలదు? ౨౩౨

క. 'వెరతలఁపు లుడిగి, సంధికి
నొడఁబడు మిది లెస్స; దీని కొడఁబడమి గడుం
జెడుతెరు; విప్పటి [1]పదనుఁ
గడవఁబడుట ద్రాటఁ దప్పుకరణియ చుమ్మీ.' ౨౩౩

— కర్ణవిజయముపై రారాజు విశ్వాసము —

ఉ. అన విని, యమ్మహీరమణుఁ డాతని కిట్లను: 'ఇప్డు దుష్పవే
మని పని దీర్చి. మారుత తనూభవుఁ డాడినమాట యేర్పడ
న్వివియును సంధి సేయుటకు నీ వభిలాషము సేఁత యొప్పునే?
పెనఁకువ కర్ణుఁ డే లుడుగు? బేలవె? మానుము ద్రోణనందనా! ౨౩౪

1. పదను గడవఁబడిన దాటుతప్పు కరణియ చుమ్మీ.

శా. 'శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ, డపరిశ్రాంతుండు గర్ణుండు; దు
ర్దాంతోదగ్రత నేఁడు గీటడఁచు నీతం డాతనిన్, వహ్ని య
త్యంతంబుగ శీతత్వ మొందినను గోత్రాతల్ వడం గాదినం,
గుంతీసూనునిచేతఁ గర్ణున కయిం గోల్పాటు వాటిల్లునే?' ౨౩౫

వ. అని పలికి, యజ్ఞనపతి తన సైనికుల నాలోకించి సమరసముత్సాహ పోషణంబు లగు భాషణంబుల ముఖరుం డగుటయు; నఖిలతూర్యంబు లొండొండ మ్రోసె. పాండవబలంబునను భేరీ పణవాదుల రణనంబులు నిగిడె. నప్పుడు కర్ణుండును నర్జునుండును— ౨౩౬

—♦ కర్ణుఁడు అర్జునుఁడు ఒండొరులు తలపడుట ♦—

క. కరి కరి, గిరి గిరి, నంభో
ధర మంభోధరముఁ బెలుచఁ దాఁకిన క్రియఁ దాఁ
కిరి; కదఁగి గగనతటియును
ధరణియు మ్రోయుచు వడంక ధరణీనాథా! ౨౩౭

క. మెఱయు వెలిమావులును, గడు
మెఱుఁగారెడు నరదములును, మింటను మంటల్
వఱపెడు వాలమ్ములుఁ జూ
పఱ నత్తాలుతాఁకు వెఱఁగుపడఁ జేసె నృపా! ౨౩౮

వ. ఇవ్విధంబున నవ్వీరోత్తము లుదాత్తభంగిం దలపడి పెనంగం దొడంగిన, మఱియు సేనలవారలు నార్పులు వింగి ముట్టఁ జెలంగి; రట్టియెడ, ౨౩౯

మ. 'భరితోత్సాహతఁ బేర్చి, దీప్తతరగ భల్లమ్ములొక్కుమ్మడిం
బరఁగం జేయుము కర్ణగాత్రమునలోఁ; బార్థుండ, వే త్రుంపు మి
క్కురుభూపాలకు రాజ్యకాంక్ష, దొరయే కోదండపాండిత్య వి
స్ఫురణం గర్ణుఁడు నీకు? నీబలుపు నేఁపుం జూపు మత్యుగ్రతన్.' ౨౪౦

వ. అని, పాంచాలురు పార్థజయార్థసంభాషణంబులు సేసిరి; కౌరవులు గర్ణు డగ్గఱి—

ఉ. 'కదఁగుము నీదు బాణములఁ గవ్వడి గూలినఁ జాలు; నంతతోఁ
జెదరుదురు పాండవుల్ రణము సేయు నదగ్రత యెల్లఁ దక్కి, పే
రడవుల కేఁగి సాధుమునులై చరియింతురు; కౌరవేంద్రుఁ డీ
పుడమి సమస్తముం బొగడు పొంపిరి వోవఁగ నేలు లీలతోన్.' ౨౪౧

వ. అని తఱిమిపలికిరి. ప్రొద్దునం జాల ప్రాలెఁ; గాలాంతకప్రతిములగు నప్పార్థకర్ణు
లనోన్యజయార్థులై పెనంగునప్పుడు. ౨౫౩

—♦ కర్ణార్జును లిరువురు దివ్యాస్త్రములను ఎత్తుకు పైఎత్తుగా ప్రయోగించుట ♦—

సీ. కర్ణుండు పది చండకాండంబు లర్జును
తను వునఁ జొనుప, నర్జునుఁడు దీప్త
ఘనబాణములు పదునెనిమిది కర్ణు మైఁ
బరఁగింప; నయ్యంగపతి దళోగ్ర
చక్రమార్గణముల సరభసంబున నొంచె
నన్నరు. నాతఁడు నట్టి వన్ని
శరములు రాధేయు నురమున నాటించెఁ;
నతఁడు దొమ్మిదివాఁడుటమ్ము లతని

తే. వక్షమునఁ గ్రుచ్చి సాయకద్వయము శౌరి
మేన నిగిడింప, బీభత్సుఁ డేను మెఱుఁగు
తూపు లా సూతపుత్రు నెత్తుట మునుంగ
నేసె బాహాసముల్లాస మెనక మెనఁగ ౨౫౪

ఉ. అలిగి కడంగి సూతసుతుఁ డచ్యుతపార్థులఁ దీవ్రబాణసం
తతిఁ బొదువం, పరాక్రమ కుతూహలి యవ్విజయుండు పిన్నన
వ్వొలపి ముఖాంబుజంబునకు నొప్పుగఁ దద్రథ రథ్య కేతు సూ
తులను దదీయగాత్రమును దూపులవెల్లి మునుంగఁ జేసినన్. ౨౫౫

క. అతఁడును దురగ సారథి
కేతుయుతము గాఁగ ముంచెఁ గ్రీడయపోలెన్
శాతశరవృష్టి నన్నరు;
పేరెఱుఁగున మఱియుఁ బెనఁగి రిద్దఱుఁ గడఁకన్. ౨౫౬

శా. ఆయుగ్రాహవకేలి విల్లు నిపుణుండై యొప్పఁ, నప్పార్థుఁ డా
గ్నేయాస్త్రం బరివోసి దారుణమహాగ్ని జ్వాలికల్ భీషణ
ప్రాయవృంగి నభస్థ్సలిన్ విసరఁ, దర్పస్ఫూర్తి రోఖిల్లి రా
ధేయాంగ దహనాభిలాష మెసఁదన్ దీపింప బెట్టేసినన్; ౨౫౭

ఉ. అంతక కోపవహ్ని విపులాకృతి గైకొని వచ్చినట్లు, మి
న్నంతయుఁ దాన యై కవియు నవ్విశిఖంబు మనంబులోన నా

వంతయు శంక లేక, సముదగ్రత వారుణమార్గణాహతిన్
శాంతముఁ జేసె విక్రమవిశాలుఁడు కర్ణుఁడు మారు మబ్బుగన్। ౨౭౮

ఆ. ఫల్గునుండు మేఘబాణ మేసిన, భూన
భోంతరంబు సంభృతాంధకార
మయ్యె। సూతసూనుఁ డనిలాస్త్ర మేయుడు
నాతమంబు విరిసె నాక్షణంబ। ౨౭౯

ఉ. అర్జునుఁ డైంద్రబాణము సమంచిత[1]భక్తి ధరించి మంత్రవి
స్ఫూర్జితగాండివుండయి రిపుప్రకరంబులు సంచలింప న
త్యూర్జితశక్తి నేయుడు, మహోగ్రబహుప్రదరప్రకారతా
దుర్జయలీల నిర్మథనదోహలియై యది కర్ణుఁ గిట్టినన్। ౨౮౦

క. అతఁ డభిమంత్రితబాణ
ప్రతతిఁ దదుద్రేక మడఁచి; పార్థుని మేనన్
శితశరములు నినిచిన; మా
రుతపుత్రుఁడు గనలి, యన్నరున కిట్లనియె:- ౨౮౧

—◆ మారుతపుత్రుఁడు పుండరీకాక్షుఁడు కిరీటిని ఎగఁగొల్పుట ◆—

ఉ. 'సూతసుతుండు నీయెదుర స్రుక్కక నిల్చుట కాక, నీశర
వ్రాతము నిల్వరించి యనివారణ నొంపఁ దొడంగె। ఖాండవం
బేతెలివాఁడి కాల్చితి మహేంద్రుఁడు నివ్వెఱఁ గంది యుండఁగా,
వాతెలి వాత్మ నూల్కొలిపి యగ్గలికం దెగటార్పు మీతనిన్. ౨౮౨

చ. 'తెగి మన కగ్గమై యరుగుదెంచిన వాఁ డితఁ డల్కి యింక నొం
దుగడకుఁ బోవ కుండఁగఁ గడున్ వెస దగ్గఱి, యేఁ గపాలముం
బగులుతునో గదానిహతిఁ। బార్థ, భవత్ప్రకట ప్రతిజ్ఞకై
తగ దవి మాన్చె దేవి, విశితప్రదరంబులఁ ద్రుంపు కంఠమున్.' ౨౮౩

వ. అని పలికె; నప్పుడు, ౨౮౪

సీ. పుండరీకాక్షుండు గాండీవితో:-'నీదు
దివ్యబాణములు రాధేయుచేతఁ
దూలిపోవుటయు, బల్ దూపుల నాతండు
నిను నొంచి యిట్లు పేర్చినవిధంబు,

---

1. శక్తి.

సత్సాహ మెదలి పీ పునికియుఁ గని, కురు
సంతతి యార్వఁ బాంచాలకోటి
పిఱుసని పోవంగ నెఱుఁగవో; యెఱిఁగియుఁ
దగఁజేయునదిలేక వెగడుపడితొ।

తే. చక్ర మిచ్చెద నతని మస్తకము దునుము'
మనిన నగుచుఁ గిరీటి, బ్రహ్మాస్త్ర మధిక
విస్ఫురతమై నేయ, నది బహువిస్ఫురత్ర
దీప్తశరమూర్తిఁ గర్ణునిదెసకు నడరె. ౨౯౫

క. ఆ రథికుఁడు దఱఁకక నియ
మారూఢ ప్రౌఢభావుఁ డగుచుఁ, దదస్త్రో
దారతర బలమునన త
ద్దారుణసంరంభ ముడిపె ధరణీనాథా। ౨౯౬

తే. ఉడిపి, తోడన కవ్వడి యొడలఁ, గృష్ణు
మేన మూఁడుమూఁ డదరించె మెఱుఁగుఁమూపు।
లన్నరుఁడు గర్ణుతనువు శల్యాంగకముఁ
జించెఁ దొమ్మిది తొమ్మిది శితశరముల। ౨౯౭

ఆ. మొనపి క్రీడి మఱియు మూఁడు నెనిమిదియు
రెండునాల్గు పదియుఁ జండమార్గ
ణములఁ గ్రుచ్చె సూతనందనుమై; నతఁ
డుఱక యతని మౌర్వి యూడనేసె। ౨౯౮

వ. ఏసి, మఱియు శితశరంబులం బొదువం బొలి వోవక, పార్థుండ్రదాగుణంబు సమాహితంబు సేసి పెల్లేసిన; రయంబున రాధేయుం డతని శింజిని శిథిలంబు గాద కాక యని తలంచె, నాధనంజయుం డతని వింటినారి వికలంబుఁ గాఁ జేసి; ౨౯౯

క. చిఱునగవుతోడ మైమఱుఁ
వఱువుట్లుగఁ జేసి, యతనియంగము దోఁగం
బఱపె రుధిరంబు, బెడిదపు
మెఱుఁగు వెడఁద యంపగమి నమిత్రులు దలఁకన్. ౩౦౦

ఉ. తెరలక కర్ణుఁ డవ్విజయుఁ దీవ్రశరత్రయవిద్ధుఁ జేసి, మం
దరధరు నప్రపంచక శితాంతహతిం గడు నొంచె; * నా శరో
త్కరము వరప్రభావకలితం బగుటన్ మగుడంగ వచ్చె ని
ష్ఠురరభసం బెలర్ప; మధుసూదనుఁ గ్రమ్మఱ నేసె నతఁడున్; ౩౦౧

క. అలఘు పటుభల్ల పంచక
ముల రెండిటం గ్రీడి చిత్రముగ నయ్యస్త్ర
మ్ములు మూఁడు మూఁడు శకల
మ్ములుగాఁ దునుమాడె, జనులు పొగడ నరేంద్రా! ౩౦౨

క. కర్ణునిమెయి నాలోనన
కర్ణాంతాకృష్ట చండకాండము లధికో
దీర్ణ క్రోధంబున న
భ్యర్ణగతుం డగుచుఁ గ్రుచ్చె నతఁ డేపలరన్. ౩౦౩

చ. మఱియు నరుండు సూతసుతు మర్మవిభేదన మాచరించిన
న్మెఱుఁగులు గ్రమ్మనమ్ముల విశృంఖలధైర్యము పేర్మి నాతఁ డు
క్కఱక వెసంగె; దానఁ గన నగ్గలమై పెన నమ్మహోరుజాం
దఱిముఱిఁ జీఁకటుల్ గవియ నల్లుగ రోదసి నిండెఁ దూపులన్. ౩౦౪

తే. వెగడుపడి చక్రరక్షకుల్, వెనుక దిక్కు
గాచు రథికులుఁ బార్శ్వసంగతులుఁ దమ్ము
విడువఁ జాలక లజ్జ వో విడిచి రపుడు;
గర్ణువారలు వాఱుట గని, విభుండు; ౩౦౫

* కర్ణుఁడు ప్రయోగించిన యీ శరోత్కరము ఇంద్రుఁడిచ్చిన శక్తి: వరప్రభావకలితము! ఇది కృష్ణుని చక్రమువలెనే లక్ష్యమును తాకి, కొట్టి మరల కర్ణునిచేతికి వచ్చి చేరుచుండును. ఇట్టి ఆయుధము నేఁడు, ఆస్ట్రేలియా ఆదిమజాతులవారి చేతిక్కి యున్నది. కొండవలివలె వంపుతిరిగిన దీనిని Boomerang అని అందురు. ఈ ప్రకరణ యుద్ధమంతా కర్ణుని శస్త్రాస్త్రసంపద శాపగ్రస్తము కాలేదని, మొక్కపోలేదని, స్ఫురణ మాయలేదని వర్ణించుచున్నది. ఇఁక జయాపజయములు కాలాధీనములు ["మంత్ర శిక్షౌషధంబులు మేలుసేఁత కాలకీలితంబు" అని; శాంతి-1 : 185.]

ఈ పర్వయుద్ధమున ఇతరసారథులనువలెనే శ్రీ కృష్ణునిగూడ శరాహతికి పాల్పడఁజేయుచున్నారు. ఇంద్రుఁడు శక్తి నిచ్చుట-ఆ-7, 370.

—♦ దుర్యోధనుఁడు తనయోధులను అర్జునుపైకి పురికొలుపుట ♦—

క. ఆ దిక్కువారు భీముం
దాడిగ నని సేయకుండు నన్నియతి యెడం
దా దైన్యమొంది తప్పం
గా దని యూహింపవీని కలఁక కతమునన్. ౩౦౬

వ. ఇరుగెలంకుల మూఁకలం గలయం గనుంగొని యెలుంగెత్తి:— ౩౦౭

క. 'తొదరఁకు పొదువం దేయఁకు
పొదువఁకు బీభత్సుఁ బ్రిదిలి పోవీక వెనం
బడవైవుం దొక్కుమ్మడిఁ
గడఁగి!' యనుచుఁ జేయి వీఁచెఁ గౌరవనాథా! ౩౦౮

క. విను, మతఁ డిమ్మెయిఁ బురికొలి
పిన, రథ కరి తురగ సుభటబృందములు రయం
బున నురవణించె నయ్య
ర్జునుపైఁ; దగువారు నిలిచి చూచుచు నుండన్. ౩౦౯

వ. ఎదిరి సైన్యంబు సమరంబు దొలఁగి యుండుట యెఱింగి, కడఁగుట పాడి గా దని దొరలు దురంబునకుం జొరకుండిరి. గాండీవి కోదండగుణ రణన భరిత భువనభోంతరుం డగుచు, వివిధ విశిఖ జ్వాలాకలాపంబున వేఁడిమి సూపిన, వేవఱి వెఱచి యమ్మూఁకలు పఱచినం గనుగొని యక్కురునాథుం డద్దొరల నుద్దేశించి.

క. 'బీరమున లావుఁ గల్గిన
మీ రందఱుఁ గర్ణు నొకఁడు మీఁదన యిమ్మెఁ
బోరెల్లఁ ద్రోచి ఫల్గునుఁ
జేర కునికి యాయుధోపజీవుల తెఱఁగే?' ౩౧౧

వ. అనిన విని, యుల్లంబుల లేనియుత్సాహంబు దెచ్చికొని వా రొక్కుమ్మడి నురవడించిన; ౩౧౨

మ. భరితక్రోధ మహోగ్రవృత్తి విదముల్ భంజింపుచున్, సూతుల
న్ధరణిం గూల్చుచుఁ, జాపముల్ నఱకుచుఁ, బ్రత్యంబులం జంపుచున్,
నరుఁ డభీలపరాక్రముం డగుడు దైన్యం బంది వెన్నిచ్చి వి
చ్చిరి వా రందఱు; దివ్యసంఘము నుతించెం జూచి యవ్వీరునిన్. ౩౧౩

చ. కురుపతి వెండియుం దలఁపఁ గోత్తల పేయక క్రమ్మఱంగ నె
వ్వరు నటభీతి; విల్లు మనవా రెదగాఁ జని చూచుచుండి ర
వ్వరుసున, నానమిద్ధరణి భాగము శూన్యతఁ బొందఁ, గర్ణుఁ డ
న్నరుఁ దలపడ్డ నప్పటిరణంబు మహాద్భుత మయ్యెఁ భూవరా! ౬౧౪

చ. క్రమమున సోలి చుఁడియుఁ బరాక్రమసంపదసొంపు మీఱ, దు
ర్దమ వివిధాస్త్రజాల తిమిరంబుల నొందొరుఁ గప్పి కప్పి. శౌ
ర్యమునను బాహువీర్యమున రాజుల నచ్చెరు వందఁ జేయ, ను
గ్రముగఁ బెనంగి రయ్యమరరాజ తనూజుఁడు సూతసూనుఁడున్! ౬౧౫

— కర్ణుని సర్పముఖశరము గుఱితప్పునట్లుజేయ శల్యుఁడు ప్రయత్నించుట —

వ. అట్టియెడఁ, దక్షకునపత్యంబై తత్పోదరమందగు నైరావతుండు పెనిచి యుక
లాలింప మల్లిపిల్లిన యశ్వసేనాభిధానుం డగు నాగకుమారుండు, సర్పముఖశరా
కారంబుగై కొని తనయొద్ద నుండఁ; దాను బసిండిపొలు బెట్టి యనుదినంబును
గంధపుష్పంబుల నక్షతంబుల నర్చించుచు నయ్యర్జునుమీఁదం బ్రయోగించు
వాఁడై యున్న, యట్టి యమ్మహనీయాస్త్రంబు రోషావేశవివశుం డగుచుఁ బుచ్చి
కొని, తల దెగ వేయుటకై యక్కర్ణుండు సముద్దీప్తజ్వాలాజాలంబు లంబరంబునం
బర్వఁ. జూపఱుల హాహాకారంబుల నేయం గార్ముకగుణంబున సంధించి తెగ
వాపినం గని, యారథిపు[1]చూపు కంఠంబునక్కటికిం గాక తప్పి యపాంగ
ప్రదేశంబుకొలంది యగునట్లుజేసి, యది నెపంబుగా శల్యుం దనవికిఁ జిత్తవైకల్యం
బాపాదింపం దలంచి: 'యీసంధానంబు మెద దునుముట కనుగుణంబు గాదు;
నిపుణంబుగా నిరూపించి యొండుభంగి సంధింపు' మనినఁ, గర్ణుండు గనలిన
కనుఁగవఁ గెంపు గడలుకొన, నమ్మద్రపతిం జూఱమఱం జూచి. ౬౧౬

క. 'ననుబోఁటి జోదునుం గా
దని పలుకఁగ నేర్తు నీకు నంత గలదె? య
ట్లును గాక వినుము! *కర్ణుం
డినుమా తొడిశరము దొడుగునే పదుల నగన్?' ౬౧౭

వ. అని పలికి, కలుషం బగుచిత్తంబుతో నెఱిం గెత్తి 'ఫల్గున, ఫల్గున పొలిసితి' వంచు
నేసిన; ౬౧౮

1. తూపు.
* "నసంధత్తే ద్విః శరమ్ శల్య కర్ణో" అని మూలము.

క. [1]పలుదెస మంటలు ప్రబ్బఁగ,
నలఘుస్ఫురణమున నిగుడు నయ్యస్త్రంబుం
జలజాక్షుఁడు గని పంచాం
గుళమాత్రము రథము ధరణిఁ గ్రుంగ నదుముడున్. ౩౧౯

క. సుర గరుడ ఖచర విద్యా
ధర ఖేచరు లంబరం బుదాత్తధ్వనిసం
భరితముగఁ బొగడి రమ్మర
హరు దివ్య ప్రసవ విరచితార్చనతోడన్. ౩౨౦

— సర్పముఖశరము, కిరీటి పురందరదత్తమగు
కిరీటమును భూమిపై పడద్రోయుట —

మ. కురువంశోత్తమ, వారిదిక్కు ప్రజ సంక్షోభింప నప్పాఁప తూ
పు రయం బుగ్రము గాఁగ బిట్టడరి, దంభోళిప్రభగ్న క్షమా
ధర శృంగాకృతిగా హరించెఁ బహురత్నస్ఫీత రశ్మిచ్ఛటా
స్ఫురితంబైన కిరీటముం విజయునొప్పుం దేజముం గుందఁగన్. ౩౨౧

తే. జనులు విహ్వలు లగునట్టి ఘనరవంబు
దిశలయందు నాకసమున దీటుకొనఁగఁ.
గర్ణుఁ డిట్లు భేదించె! దిక్పతులచేత
నైనఁ జెడని కిరీట మయ్యహిశరమున. ౩౨౨

క. సురపతి తపంబు సేసినఁ
బరమేష్ఠి ప్రియంబుఁ బొంది, బహుమానపుర
స్సరముగ నిచ్చినయది య
క్కిరీట! మరిభీషణత్వ కీర్తిదము నృపా! ౩౨౩

ఆ. వనధివాసు లగు నివాతకవచు లను
దనుజు లా పురందరున కజయ్యు
లైన, నతఁడు పనుప నర్జునుఁ డోర్చిన.
మెచ్చి యక్కిరీట మిచ్చె నధిప! ౩౨౪

1. పలుదెసల మంట లుమియుచు.

చ. వినుము! నరేంద్ర, చూడ విన విస్మయ మిట్టిది [1]పాఁపఱమ్ము వా
త నెగయు ఘోరరూపభయద ప్రథమాన విషాగ్నిజిహ్వికల్
దవికినఁ, బెల్చ మండుచు శిలాస్థలి దొల్లె! నినుండు పశ్చిమాం
బునిధి నితాంతదృశ్యరుచి బొల్పెసఁగం బడుభంగి దోఁపఁగన్! ౩౨౫

వ. అప్పుడు; ౩౨౬

ఉ. శృంగములేని నీలగిరి చెయ్వునఁ గ్రిడి కిరీటహీనుఁ డ
య్యుం గనుపట్టె, *వెల్లతల యొల్లియ మౌళి దృఢంబుగా నమ
ర్చెం! గురునాథ, పూర్ణశశిచెన్నునఁ బూర్వమహీధరంబు కాం
తిం గడచన్నయందము ప్రతీతము గాఁగ నటించు చాడ్పునన్! ౩౨౭

వ. అట్లు రాధేయకర ప్రముక్తంబై కిరీటంబు నిర్దహించి నేలం గలపిన యమ్మహో
రగంబు గ్రమ్మఱం గవిసినం గని, కమలనాభుండు గవ్వడితో:- 'మనమీఁద
మగుడ నిమ్మహాసర్పంబు సనుదెంచు చున్నయది!' యనిన; నతం:- 'దీని
యెక్కడిసా! మిట్లు వచ్చుటకుఁ గతం బేమి?' యని యడిగిన; 'దీని నెఱుంగవే!
ఖాండవం బేర్చునప్పుడు, దనతల్లిని రక్షించికొని యనలంబునకుఁ దప్పిపోవం,
బోవ నీక, నీ వేసిన నన్నాగాంగన మృతిం బొందె; నప్పగ వాటించికొని కర్ణుకడ
నమ్మెయి నున్న యశ్వసేనాభిధాన భుజంగంబు. ౩౨౮

---

1. పాముటమ్మ.

* కిరీటము క్రిందబడిన కిరీటిదృశ్యమును శృంగములేని నీలగిరికి పోల్చుచు, ఆయన తెల్లనితల, తలగుడ్డచుట్టిన శిగ, అస్తగిరి చెందిన పూర్ణశశి అందమును వెదజల్లుచున్నవని, ఆయనను సజీవంతో మన కండ్ల ఎదుట నిలబెట్టుచున్నది - తిక్కన వర్ణనము. అది అటుండ- అర్జునునివిషయమై రెండుసంగతులను వెల్లడించుచున్నది యీ పద్యము:-

1. అర్జునుఁడు నల్లనివాఁడు (అర్జునుఁడు విరాటపర్వవివరణముప్రకారం తెల్లనివాఁడు కాఁడు.)

2. ఈనాఁటికి నతనివయస్సు 70 సంవత్సరాలు. కాబట్టే వెల్లతల! ఈ గ్రంథమున అచటచట, సందర్భోచితముగ ఇచ్చిన ప్రాయములనుకూడిన యీ లెక్క సరిపోవును.

దుర్యోధనుఁడు, భీమునితో సమవయస్కుఁడు, అర్జునునికంటె ఒక ఏడాది పెద్ద. తొడలు విరుగఁగొట్టబడి, నడుమువిరిగిన నాగుబాము వలె, మన్నులో బడియున్న '....అమ్మహీకాంతుఁడు ధూళిపాటిన వదనంబుపై నెఱసిన వెంట్రుకలు వాయంద్రోచికొని' (శల్య-2 ఆ॥ ౩౩౮-వ వచనము)....అని, రాజరాజు ముసలితనమును చెప్పుచున్నది-తిక్కన భారతము.

తే. 'అతఁ డేయఁ గిరీటంబు నపహరించి,
దానఁ గోపంబు వోవక తాన కడఁగి
విన్నుఁ బరిమార్పఁ గడఁగెదు' నన్న నెఱిఁగి,
యాఱు పటుభల్లములఁ దునుమాడె నతఁడు. ౪౨౯

వ. అత్తెఱంగున; ౪౩౦

— కర్ణార్జునుల మొండిపోరు —

సీ. ఉరగంబుఁ దునిమి, వే మరలి కర్ణునిమీఁదం
బదియుఁ బండ్రెండును బటుశరములు
విగిడించి, యుజ్జ్వలం బగు బొద్దనారసం
బేసిన, నది రుధిరాసవంబు
పానంబు సేయుచు మే నుబ్బి చనిన, దం
డాహతంబైన మహాహివోలె
నాసూతనందనుఁ డత్యుదగ్రుం డయ్యు.
నంతకుమున పాఁపరమ్ముచేత

తే. నర్జునుఁడు పావమికి వెఱఁగంది, యాతఁ
డటుల గెరలి పండ్రెండువాలమ్ము లేసి
పద్మనాభుని నొప్పించి, పార్థు నొకటి
కొఱఁతగా మూఁటుశరముల నుఱక నొంచె. ౪౩౧

క. వెండియు బలువిడి నయ్యా
ఖండలసుతు నురము గ్రూరకాండంబుల నొం
దొండ కడు నొవ్వ నేసి, య
తం డుబ్బున నార్చె గగనతల మదురంగన్. ౪౩౨

గీ. అర్చి పెలుచ నట్టహాసంబు సేసిన,
నలిగి యతఁడు భల్లములఁ దదీయ
భూరికంకటంబు వొలుపఱ నఱకి, యు
ల్లసిత మకుటకుండలములు డులిచె. ౪౩౩

వ. డులిచిన నప్పలుమగండు; ౪౩౪

క. శిరమునఁ గర్ణుండును నె
త్తు రొలుక బరిపేనితోడఁ దూలక బాహా
స్ఫురణంబు మెఱయ, సాయక
పరంపరలు నరునిమీఁదఁ బఱపెం బెలుచన్ । ౩౩౫

తే. వానిఁ దునుమాడి యాపాండుసూనుఁ డలఘు
శరచతుశ్శతిఁ బొదివి నెత్తురులు మేనఁ
బఱవ, గైరిక నిర్ఝరప్రకర శోభి
తాచలము వోలె పొలిచె నయ్యంగరాజు । ౩౩౬

ఉ. అమ్మెయి నుగ్రుఁడై మఱియు నర్జునుఁ డుజ్జ్వలవత్సదంతకాం
డమ్ములు పెక్కు సత్వర దృఢస్ఫురణం బలరంగ నేసి, ర
థ్యమ్ముల సూతుఁ గేతనము నాతనితేరును గూడఁ గప్పె, మే
ఘమ్ములు గ్రమ్మి భూధరము గప్పినభంగిఁ దలంపఁ బట్టుగన్ । ౩౩౭

వ. ఇవ్విధంబున విక్రమకుతూహలియై విజృంభించె. నప్పుడు : ౩౩౮

ఉ. నెత్తుటఁ దోఁగి మేను కమనీయరుచిం గొమరార, బాణసం
పత్తి యుదగ్రతన్ మెఱయ, భాస్వరుఁడై యరదంబుమీఁద భూ
పోత్తమ, కర్ణుఁ డొప్పె । నరుణోజ్జ్వలమండల కాంతిపూరము
న్మొత్తపు దీప్తిం దగ నినుం డపరాద్రి వెలుంగుచాడ్పునన్ । ౩౩౯

వ. ఇట్లు సూతనందనుండు నొచ్చియుఁ బొలివోనిబంటుతనంబున నంట మెఱుంగులు దదలం బరఁగ శరంబు లడరించుచు, బహుబాణంబులు రేణువులుగాఁ జేయుచుండ, సవ్యసాచి దివ్యాస్త్రవిలాసంబు భాసమానం బయ్యె । నయ్యవసరంబునఁ గాలం బదృశ్యాకారంబున— ౩౪౦

— కర్ణుని తేరి దాపటికల్లు నేలఁ గ్రుంగుట —

క. 'భూసురశాపంబున నిదె ।
యీ సూతజురథము చక్ర మిలఁ గ్రుంగెడు. నీ
శాసనుఁడగు నీతఁ' డని పే
వాపముదయ యుగ్మకము వినంబలికె నృపా । ౩౪౧

వ. పరశురామ దత్తం బయిన భార్గవాస్త్రం బను పేరిటి మహనీయసాధనం బప్పుడు రాధేయునకుం బ్రతిభాసింప కుండె. దాపటికల్లి గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె.

నట్లు జామదగ్న్య మహీసురుల శాపంబు లస్త్రబలంబునకు రథంబునకు వైకల్యం బాపాదించి చిక్కువఱచుటయును; సర్పముఖశరం బాభంగి విఫలప్రయత్నం బగుటయును. దనమనంబున నొవ్వదరి; యక్కర్ణుండు గరంబులు విదుర్చుచు.

తే. 'ధర్మవాదులు, ధర్మతత్త్వప్రధాన
చిత్తులగువారిఁ బూని రక్షించు ధర్మ
మందు; రది బొంకు గావించె; నతులధర్మ
శీలుఁడగు నాకు ధర్మువు [1]పెలవు లేద!' ౩౪౩

క. అని ధర్మంబును దూఱఁగఁ
దను నర్జును బాణవితతి తద్దయు పడిఁ దాఁ
కినఁ, గర్ణుండు విషాదం
బున వెందియుఁ బెద్దదూఱు భూవరముఖ్యా! ౩౪౪

క. కన లధికమైన లావె
క్కిన యయ్యంగపతి నొంచెఁ గృష్ణార్జునులన్
సునిశిత శరములు మఱియుం
జొనిపెను దనధైర్యమహిమ సుర లగ్గింపన్. ౩౪౫

— కర్ణుఁడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించుట —

వ. అలిగి. యర్జునుం డాశీవిషంబులుంబోని విశిఖంబు లాఱు కర్ణుమే నుచ్చి చన నేసినం. గ్రోధబాపితుండై. యతండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుటయు నప్పార్థుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన; ౩౪౬

క. అమితబలంబగు బ్రహ్మా
స్త్రముచే నయ్యస్త్ర మపహృతం బగుటయుఁ, జి
త్తమున విషాదము దనకఁగఁ
గమలాక్షుఁడు గారవమున గాండివితోడన్:— ౩౪౭

వ. 'నీయస్త్రం బిప్పుడు కర్ణాస్త్రంబుచే విధ్వస్తం బయ్యె; విట్లుగా నేల?' యన వుడుఁ, గవ్వడి బ్రహ్మాస్త్రప్రయోగంబున నమ్మహనీయ సాధనంబు బాధితంబు సేసి రాధేయాంగంబు బాణజాలంబులం బొదివి నొప్పించిన. నమ్మేటిమగండు

1. చెలిమిలేదు.

గాండీవంబు మౌర్వికోటిఁ జాపివో నేసిన, నా సవ్యసాచి మగుడ నెమర్చి, మార్గ
ణంబులు పిగిడించిన; రయంబున నా సూతపుత్రుమూడ్కి కమ్మార్వి యూడుట
దోఁపకుండె। నవ్వీరుండు వివ్వచ్చువిశిఖంబులు వారించి యతని తనువు నొంచిన;
వెండియుఁ బుండరీకాక్షుండు సహస్రాక్షనందను నుద్దేశించి:— ౩౪౮

క. 'వినుు నొంచువాఁడె కర్ణుం।
డనితర సులభప్రకారమగు భుజవీర్యం
బున ననమానోజ్జ్వల ఖే
లనమునఁ దెగటార్పు శరవిలాస విహారా' ౩౪౯

—♦ కర్ణుఁడాడిన రణధర్మసూక్తులు ♦—

వ. అనునప్పుడు, విష విస్ఫుర ద్భుజంగ భంగికంబైన బాణంబు రౌద్రమంత్ర సహి
తంబు సేసి, కర్ణుండు పార్థప్రాణంబులు గొన నప్పళించి సంధింప, మున్ను
కొండొక క్రుంగినచక్రంబు కుంద మునుంగం దిగఁబడిన, నొడ్డగెనవై యరదం
బేటునకు ననువీక తక్కిన, నక్కటి యక్కర్ణుం డప్రతీకారంబులగు రోష విషా
దంబులఁ గన్నీరొలుక, రథంబుడిగ్గి కవ్వడిదెసఁ గనుంగొనుచు ని ట్లనియె:—

సీ. 'అరదంబు చక్రంబు ధరఁ జాలఁ గ్రుంగిన
నెత్తెద, నంతకు నేయ కుండు;
మేను భూమిస్థుఁడ, వీవు రథస్థుండ,
వియ్యెడఁ దగ వగు నేయ కునికి।
విరదలవానివి విరథుని నాయుధం
బిడినవానిని ఖూయు లేయ రెండు;
మహిత శూరుఁడ వనుమాత్రగా దుత్తమ
కులుఁడవు, రణధర్మకోవిదుండ;

ఆ. విట్టి నీవు దగినయట్టి భంగిన యని
సేయవలయు; నిట్లు సెప్పు టెల్ల
బాడి యేర్పడంగఁ బలుకుట గావి, గో
వింపుటకును, నీకు వెఱచి కాదు।' ౩౫౦

వ. అనిన విని, యచ్చ్యుతుం డతని కి ట్లనియె :— ౩౫౧

క. 'ఏమీ తగవును ధర్మము
నీమనమున నేఁడ పుట్టెనే? గర్వము మ
ద్దామ దురభిమానము నే
లా మఱచితి కర్ణ! యాచలం బెఱిఁ బోయెన్? ౨౩౩

ఆ. 'పరమధర్మపరులు పాండుభూవల్లభ
సుతులు, వారి నతులశుభము లొందు;
ధర్మహీనులైన ధార్తరాష్ట్రులకుఁ బా
టిల్లు నివ్విధమున నెల్లచేటు. ౨౩౪

వ. 'దీనికి నీవు కటకటంబడినం బోవునే?' యని పలికి వెండియు: ౨౩౫

సీ. 'గొంతియు నందఱు గొడుకులు సుప్తులై
యుండంగ లక్కయిల్ మండఁ జేసి;
కపటంపు జూదంబు ఘటియించి ధర్మాత్ముఁ
డగు ధర్మసుతు సిరి యపహరించి;
యంతఁ బోవక ద్రుపదాత్మజఁ దెచ్చి న
భాస్థలి నమ్మోయి భంగపఱిచి;
యమ్మహాత్ములఁ జంప నడవికి ఘోషయా
త్రావిధి నెపమున దాడి వెట్టి;
తే. బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీసుయోధనుఁడు దలఁపఁ;
గాని, యిప్పాపములకు నాదికర్త నీవ;
యన్నియెడలను నీపాడి యెందుఁ బోయె?' ౨౩౬

వ. అని యిట్లు, కృష్ణుండు గర్ణుతో నాడుమాటలఁ దోత్త్రోదం బెరిఁగిన యద్ధనంజయు ఘనంబు రోషానలంబు రోమకూపంబులఁ బటుజ్వాలారూపంబుల వెడలుట యతి విస్మయప్రదంబై యుండె; నయ్యుగ్రమూర్తి సముదగ్ర పరాక్రమంబునం గురియు పటుబాణాసారంబు వారించి, యవ్వీరు నంగంబున నయ్యంగపతి విశిఖాస్త్రంబులు నిగిడించుట మహాద్భుతంబయ్యె; నత్తెఱంగున నీరంబోక పెనంగు నతం డతిరయంబున నన్నరునిం బది దొడ్డనారసంబుల నొప్పించిన, నత్తేజోధనుం డాజ్యధారాచ్ఛటాసేకంబున నుద్రేకంబు నొందిన హుతవహుండునుం బోలె

మఱి. శత్రుసంత్రాసనంబును మిత్రోల్లాసనంబును బ్రగుణమణి జాంబూనద మయంబును జనప్రస్తుతిపాత్రంబును హస్తికక్ష్యాత్మకంబునునగు నతనికేతనం బును గనకపుంఖ ప్రభాభాసితంబైన భల్లంబునఁ బడవేసినం: గౌరవులు విజ యశో బలదర్ప ప్రియంబుల మొత్తంబులు వద్దుగాఁ దలంచుచు, హాహాకారంబు లతో నా రాధేయునిదెస నిరాశులై. రట్లు ప్రసిద్ధకేతుపాతనం బాచరించిన, దానం గనలి కర్ణుం డతి నిశిత క్రూరనారాచజాలంబులు గృష్ణార్జునులమీఁదం గురిసి వెగడుపఱచి. *యరదంబు పిఱిందికొమ్ము క్రిందికి మూఁపు సొనిపి లావున నెత్తిన, రథచక్రంబు విడువక, భూమి కులపర్వత కానన సముద్రసహితం బాఱంగుటంబు లెగసె. నట్లు కర్ణుండు రథంబు నిలిపి, మీఁదికిం జని, యెప్పటిబాణంబు సంధింప వెండియుఁ జక్రంబు దిగంబడిన, గ్రమ్మఱ రథంబు డిగ్గి యెత్త నమరె. నయ్యవ సరంబునఁ గృష్ణునుపునం గ్రీడి దోడన—　　౪౨౮

—◆ విరథుఁడు, భూమిస్థుఁడు నిరాయుధుఁడు అయిన
కర్ణుని అర్జునుఁడు దునుముట ◆—

మ. కులిశ ప్రస్ఫురణాపహాస నవిభాగుచ్ఛంబులం గల్గి యాఁ
కలిమైవచ్చు కృతాంతవక్త్ర మన. నుగ్రంబై మురారాతి రు
ద్రుల చక్రంబును గూఁటముం దెగడుచుం, గ్రూరంపు టొప్పారు నం
జలికంబైన మహాస్త్రముం దొడిగి కర్ణుం బుచ్చునం జేయుమన్—　　౪౨౯

క. ఏను దపశ్చరణంబున,
దానంబున, గురుజనాభితర్పణమున, ని

* ఈ అవసానసమయము కర్ణుని పొంచిరివోవని బీరమునే ప్రదర్శించుచున్నది: చక్రరక్షకులైన మతులెల్ల మడసిరి; సారథి చక్రము ఎత్తుటకు చేయివ్వఁడు: కల్లు ఇంకను కూరుకొనిపోవు చున్నది. ఒంటరిగా, భుజముకు తేరు పిఱుఁదికొమ్మకు మోపి ఎత్తినను అది పైకి లేవదు. ఈస్థితిలో కృష్ణునిపంపున ఫల్గుణుఁడు కర్ణుని తెగటార్చుచున్నాఁడు. కర్ణుఁడు తేరు దిగుట, గానెత్తుట, మఱల తేరెక్కి అమ్ము లేయుట, మఱల దిగుట సజీవచిత్రముగా నున్నది.

క. పరిపం బాఱినఁ గైదువు
పడినను వాహనము పడినఁ బార్థివముఖ్యా,
పొడువఁ దగదు శత్రుని, నె
య్యెడల నహింసనముఁ బోల నేసుకృతముల్.

—శాంతి-5 : 614.

త్యానూన వ్రతశీలుఁడ
నేవియుఁ గర్ణుతలఁ ద్రెంచు నీశర' మనియెన్. ౩౫౯

క. అని, తెగ నిండఁ దిగిచి యే
సిన, నయ్యస్త్రంబు రోదసీకుహరంబుం
దనమెఱుఁగుల నించుచు విరు
మొనలజనుల గాఢమూర్ఛ ముంచుచు నిగిడెన్. ౩౬౦

చ. వినద సముత్కటస్ఫురణ నింగి వగుల్పఁగ, సర్వఘాతకం
పనమగు చప్పుడయ్యె నిగిడి, పార్థివసత్తమ, యేమి చెప్పుదుం?
దునిమె, శిరంబు రక్తమునఁ దోఁగుచుఁ గర్ణుని యట్ల వజ్రఘో
రనిహతిఁగూలు గైరిక ధరాధరముం దలఁపింపఁ బట్టుగన్. ౩౬౧

— కర్ణుని సముద్దీప్తతేజము వారిజాప్తబింబము సొచ్చుట —

క. చరమగిరినుండి పడియెడు
తరణికరణి సూతపుత్రుతల పడఁ, గాంతి
స్ఫురణోజ్జ్వలంబు నతిసుం
దరమునునగు కాయ మట్లు ధరణిం బడియెన్. ౩౬౨

తే. అధిప, యంతన గను విచ్చి యఖిలజనులు
గనుఁగొనంగ, నయ్యుజ్జ్వలతనువు విడిచి
చని సముద్దీప్తమైన తేజంబు వారి
జాప్తబింబంబు సొచ్చె నత్యద్భుతముగ. ౩౬౩

వ. అట్టియెడ; ౩౬౪

క. వినుము; మహీసురశాపము
మనుజేంద్రా, సూతపుత్రు మరణాంతంబై
యునికినొ, రథచక్రము మే
దినిఁ గ్రుంగుట లేక తొంటితెఱఁగున నుండెన్. ౩౬౫

తే. దారుణాస్త్రజాలాంశుల వైరిసైన్య
తాప మొనరించి, యా సూతతనయ తరణి
పార్థదుస్తరకాలవైభవము గడవ
ననువు లేమి, నవ్విధమున నస్తమించె. ౩౬౬

క. సూతతనూజుఁడు పడినం
బ్రీతిం బాంచాలు రార్వఁ, బెల్లుగఁ దూర్య
వ్రాతంబు సెలఁగ, సమ్మో
దాతిశయము వొందెఁ బాండవానీకంబుల్. ౩౬౭

క. విడుఁగేలఁ బలుతొడలు
న్వెడఁదయురమునై రణావనిం గర్ణునొడల్
పడియున్నఁ గని విషాదం
బడరి తొలఁగుమాడ్కిఁ గ్రుంకె నర్కుం డంతన్। ౩౬౮

తే. విగతప్రాణు రాధేయు నిజకరములఁ
గరుణ పెంపున నంటుట కారణముగఁ
బావనస్నాన మొనరింపఁ బోవునట్టు
లపరజలనిధిలోనికి నరిగె నినుఁడు। ౩౬౯

వ. అప్పుడు; ౩౭౦

తే. కావఁ బాసిన కమలంబుకరణిఁ బొలుచు
కర్ణుతల యిలఁ బడియు, సుదీర్ణ కాంతి
నొప్పు నట్టియుఁ జూచి, శల్యుండు పిడము
ద్రెప్పి మోడైన యరదంబు ద్రిప్పె నధిప. ౩౭౧

క. బలితపువెస నాటోఁతుం
బులిగొనినం, బసులు వాఱుపోలికిఁ గ్రోధో
జ్జ్వలుఁడగు పార్థుఁడు గర్ణునిఁ
బొలియించిన నీదుసైన్యములు వెఱఁ బఱచెన్. ౩౭౨

తే. దీనవృత్తి శల్యుండు నీ సేనజనులు,
నట్లు పాంచాలు రుబ్బున నార్వ, సిగ్గు
వడక పాండవమధ్యము పిడము మరలి
మరలి చూచుచుఁ బాఱిరి మనుజనాథ। ౩౭౩

ఉ. గాండివ ముక్తబాణమునఁ గర్ణుఁడు గూలుటయుం గడంగి, శ
ల్యుం డరదంబు దోలుటయు, నొక్కమొగిన్ భవదీయసేన లొం
దొండ కలంగి పాఱుటయు నల్లసితుం డయి చూచి, వాయుపు
త్రుండు మహావిరావమున రోదసి పిక్కటిలంగ నార్చినన్. ౩౭౪

క. అవినయంబునఁ బాండవ
సైనికహృదయములు సౌఖ్యసంపద నొందెన్;
మానవనాథ, భవత్సుత
మానసములు శోకమూర్ఛమానము లయ్యెన్. ౪౪౩

— శల్యుఁడు దుర్యోధనునితో ఈ వైఫల్యము విధికృతమనుట —

వ. ఇవ్విధంబున కేతనరహితంబై మోడువడియున్న యరదంబు దోలికొని యరిగి, యమ్మద్రపతి బాష్పాకులలోచనుండును దీనాననుండును సుదీర్ఘతర నిశ్వాసుం డును నై యున్న కౌరవేశ్వరుం జేరంజని యతనితో ని ట్లనియె:— ౪౪౪

ఉ. 'నరవర యెందుఁ జూడమె రణంబులు; కర్ణుఁడు నర్జునుండు నం
గర మొనరింతురే యిటులు; క్రౌర్యవిరూఢికి దివ్య లొంచి ర
చ్చెరు; వని యట్టులుండె; విను చెప్పెద—నెంతయు భీతిఁ బొంది రా
హరియు నరుండుఁ గర్ణువడి, కంత విధాతృఁడు దప్పె వానికిన్.' ౪౪౫

వ. అని వెండియు; ౪౪౬

మ. 'ధరణీచక్రము నీవ యేలుటకు సత్సాహంబు వాటించి పో
రిరి, ప్రాణంబులు దాఁపమిం బడిరి వీరిం జూడు' మంచుం, దురం
గ రథేభంబులు చుట్టుఁ గూలి వికటాకారంబులై యుండ నొ
ప్పు రణోర్విం బడియున్న భూపతులఁ జూపెం; జూపి యారాజుతోన్. ౪౪౭

వ. మఱియు నమ్మద్రపతి: 'యింద్ర యమ వరుణ కుబేరులఁ బోల్పందగిన యంతే లింతలు మేటిమగలు మనకార్యంబునకై శౌర్యంబును బాహువీర్యంబును మెఱ యించి ధైర్యంబు వాగడొందం బెనంగుట విఫలంబగుట విధికృతంబు; దీనికి వగవం బనిలే'దని చెప్పి, ధనుఃఖండంబుల నాయుధశకలంబులఁ గేతనాతపత్ర చామర గజఘంటా తురంగ కింకిణుల తునియలం, గంకణ కేయూర హార మకు టంబుల తుముళ్ళ నభిరామభీషణంబగు రణాంగణంబు సూపి; నీకయి పెనంగి సమసిన సైన్యంబు నాలోకింపు; మనునప్పు డసురాంతక పార్థులు పాంచజన్య దేవదత్తంబులు పూరించిన వింగి వగుల్చు నమ్మహారవంబున గుండియ లవిసి కురుబలంబు లత్యంత వికలంబు లయి, నిశాతిత రావణనందనుఁడగు సుమిత్రా నందను సింహనాదంబున భయంబంది పరచు దానవసేనలచందంబున, నీ కొడు కున్ననెలవు విడిచి వలియంబాఱిన వెలవెలంబాఱు నక్కురుపతితో నాశల్యుండు:—

'సంధ్యాసమయం బయ్యె నేఁటికిఁ గయ్యంబు సాలింపుము; వేగుటయుఁ జేయ వలయు కర్జంబు సూచికొందమని'యె నట్టియెడఁ, గృపాశ్వత్థామ కృతవర్మ శకుని సుశర్మ ప్రభృతు లగుదొరలు పాండవజయంబునకు దైన్యంబునొందిన యానసం బుతో నిశ్వాసంబులు నిగుడ, నక్కురుపతిఁ జేరం జనుదెంచిన; నతండు మూఁకల మరల్ప రామియు దొరల యుత్సాహవైకల్యంబును శల్యుమాటల తెలుంగు నూహించి; మరలి కర్ణుం బేర్కొని విలాపంబు సేయుచు 'హా కర్ణ! హా కర్ణ!' యను నెలుంగులకో బలంబులఁ డివియ నియమించిన, దివిసి కౌరవులు దోఁడం జనుదేర నిజశిబిరంబునకుం బోయె. నప్పొవుడ పాపజూవంబున నోడి పాండునృపకుమారులు హస్తినాపురంబు వెడలి యడవికిం బోవునప్పటిభంగి నై యుండె. నయ్యవసరంబున; ౩౮౧

చ. తనువులఁ గర్ణబాణము లుదాత్తగతిం జెఱువొందఁ గౌరవుల్
కనుకనిఁ బాఱ, శౌరియును గవ్వడియుం జెలుఁగొంచి రొక్కెడ
న్వినుత మరీచులై పొడిచి విర్వక సంతమసంబు నగ్గకం
బన నభిరామమూర్తులగు చంద్రుని సూర్యునిఁ బోల్పఁ బట్టగన్. ౩౮౨

వ. ఇట్లొప్పి, యమ్మెఱుంగుటమ్ములు పెటికి వైచి, యొండొరుల యాననంబు లాలో కించి: 'రాత్రిముఖంబయ్యె; విరోధుల పెనుకొనుటకు సమయంబుగా'దని సంభా షణంబులు పేసి, తనసేనలం దివియ నియమించి; ౩౮౩

తే. బలునిఁ దెగటార్చి మరలు గోపతియు హరియుఁ
బోలెఁ గర్ణుని సమయించి లీల మెఱయ
మరలి రత్యంత మోదసంభరితు లగుచుఁ
గవ్వడియుఁ గృష్ణుఁడును బంధుగణము లలర. ౩౮౪

వ. అప్పుడు దివ్యు లన్నరనారాయణుల ననేకప్రకారంబులం బ్రశంసించుచు, నిజనివా సంబులకుం జనిరి. పాండవ సేనాజనంబులు సంతసంబునం దేలుచు ధనంజయుం జెలంగి పొగడుచుం బోయి, యివ్విధంబున జయంబునం బొంపిరివోవుచుఁ బాండ వులు విడిదల కరిగి, ధర్మనందను నగరిమొగసాలఁ జొచ్చి, రట్టియెడ; ౩౮౫

క. చెన్నునఁ గాంచాలురు మున
ము న్నానృపుకడకు వేఁగి, ముదితాత్ముండై

యున్న యతనిఁ గని, దీవన
లన్నతులను సమ్మదానులాపములఁ దగన్. ౩౮౫

వ. గారవించిరి. వివ్వచ్చుండు వేగంబ యరదంబు డిగ్గి చని, యజ్ఞనపతి చరణంబు లకుఁ బ్రణతుండైన, నతం డెత్తి యాలింగనంబును మూర్ధఘ్రాణంబును జేసె. భీమ నకుల సహదేవు లన్నరదేవోత్తమునకుఁ బ్రణమిల్లి, పార్థుం గౌఁగిలించిరి. కృష్ణసాత్యకు లప్పాండవాగ్రజునకు సవినయప్రణామంబు లాచరించిన, నమ్మహీ వరుఁ డత్యాదరంబున నభినందించె. నప్పుడు కృష్ణుం డతని కిట్లనియె:- ౩౮౬

—♦ శ్రీకృష్ణుఁడు ధర్మజుఁడు మధుర సల్లాపసౌఖ్యము ననుభవించుట ♦—

క. 'భువనము లన్నియు నొక్కటఁ
గవిసియుఁ గర్తుఁ బరిమార్పంగా నోపునె భూ
ధవ ? భవదీయ క్రోధా
గ్నివిహతుఁడై క్రాఁగెఁ గాక ! విక్కం బరయన్ ! ౩౮౭

ఆ. 'రథికవర్యుఁడైన రాధేయు పొలిసిన
యపుడ, యెల్లఁ బొలిసె నని తలంపు.
కౌరవుల కడంగె వైరంబు. నీ కింక
నెదురులేదు. ప్రీతిఁ బొదలు మధిప !' ౩౮౮

వ. అన విని, యమ్మురాంతకున కానృపుఁ డి ట్లను:-'నీవు చక్కఁ జూచిన సులభంబు శోభనము ! శ్రీధర, నీదగు కూర్మి కేను భాజన మగుటె ! నాకు దుష్కరమె శత్రుజయంబు ? భవత్ప్రసాద జీవనులము, మాకు సంపదలు వచ్చు నవశ్యము ! వింత వమ్మదున్. ౩౮౯

ఆ. 'అఖిల రక్షకుండవగు నీకు భక్తుల
మైన మమ్ముఁ గాచు టరుదె తలఁప ?
భయము నెవ్వగయును బాసి నాకంటికి
నిదుర వచ్చు నేఁడు నీరజాక్ష !' ౩౯౦

వ. అనవుడు, నచ్యుతుండు: ౩౯౧

చ. 'మనమునఁ గూర్తు గాన, తగుమాటల నాకుఁ బ్రియం బొనర్చు టొప్పును; విను ! మీజయంబునకు భూవర, యేను నిమిత్తమాత్ర ! మీ

యనుజులు నీమఱందులు మహోద్ధృత విక్రమశీలు రిట్టి ని
న్నొకఁడు పోర మార్కొనఁగ నూల్కొని రూపఱుకుండ నేర్చునే?' ౩౯౨

వ. అని యిట్లు, మధుర సల్లాప సౌఖ్యంబు నొంది, ధర్మనందనుండు పొలికలను
నూమవేడుక దనకుం బుట్టినఁ, గృష్ణునితోడం జెప్పి యతం డనుమతిసేయం,
*గాలవాలంబులు దంతవర్ణంబులునగు రథ్యంబులఁ దనరథంబునఁ బూన్పించి,
యారోహణంబు సేసి, కరదీపికా సహస్రంబులు వెలుంగ, సమస్తబంధు మిత్ర
సోదర పరివృతుండై యరుగునప్పుడు, కృష్ణు నాలోకించి— ౩౯౩

ఆ. 'సకలధరణీవలయ సామ్రాజ్యమునకు నేఁ
డేను భర్త నైతి; నెల్ల పెంపు
గలిగి నీదుకరుణఁ గడిఁదిమగండగు
పగతుఁ దశ్రమమునఁ దెగుటఁ జేసి!' ౩౯౪

క. అని కీర్తించుచు, నరుఁ గనుఁ
గొని యగ్గించుచు, ముదంబుగూరిన మదితోఁ
జని, కర్ణునిశిరమును ద
త్తనయులగాత్రములఁ జూచె ధరణీనాథా! ౩౯౫

వ చూచి తన్నప్పుడు గ్రమ్మఱ జన్మించినవానిఁగాఁ దలంచి, యాపదలకుం బాపి
సంపదలకు భాజనంబ నైతి నని యుబ్బి, యుల్లాసంబున మరలె. ఇట్లు కర్ణ
సాగరంబు గడవ నీఁది పాండునందనులు పరమానందంబు నొంది, రని, సంజ
యుండు ధృతరాష్ట్రునకుం జెప్పెనని - జనమేజయునకు వైశంపాయనుం
డిట్లనియె:- ౩౯౬

## —◆ ఫలశ్రుతి ◆—

చ. అనఘుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వరసంప్రవర్తకుల్
వినుము! నరేంద్ర, యాక్రతువు విష్ణుమయం! బిది నిర్వహించి ర
ర్జునుఁడును గర్ణుఁడుం సమరరూపమునం దగ; నీప్రబంధ మిం
పొనరఁ బఠించినం విని నొందు నరుం జిరసౌఖ్యసంపదల్! ౩౯౭

వ. అనుటయు. ౩౯౮

* తెల్లగుఱ్ఱమునకు నల్లటితోఁక ఒక అందము!

చ. ప్రకట మహార్థసౌరభ పరాశర నందన వాక్యమంజరీ
ప్రకర సమర్చితా, పరమపావననామ, జగత్త్రయీ విధా
యక పరిరక్షక ప్రతిసమాహృతికారక చిత్తవృత్తిభా
వక, భవబంధమోచన, దివాకరచంద్రకృశానులోచనా! ౩౯౯

క. వినత దురిత నిరసన శుభ
జనక కలాకల్య చరణసంభావన పా
వనతటినీమాల్య సమ
స్తనిగమ సంసేవ్య పరమసంయమిహృద్యా! ౪౦౦

మాలిని—



కరణఫల పరిత్యాగ వ్రతోదాత్తచేతః
పరిణత సుఖపీఠభ్రాజమానా, నతాంహో
నిరసన చరణాబ్జోన్నిద్రతా రాజమానా,
నిరవధిపరిణాహా, నిర్భరానంద దేహా! ౪౦౧



ఇది ఉభయకవిమిత్ర, కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి -
తిక్కన సోమయాజి ప్రణీతంబైన భారతంబున
కర్ణపర్వ - తృతీయాశ్వాసము

—సర్వము సమాప్తము—



చ. పరమపదాప్తి హేతువగు భారతసంహిత శౌనకాది భూ
సురవరు లింపునం గరఁగు చొప్పునఁ జెప్పిన, వారు మోదసం
భరితతఁ బొంది, యక్కథకు బ్రాఁతిగ నర్చితుఁజేసి రర్మిలిన్;
హరిహరనాథ, సర్వభువనార్చిత, నన్ దయఁజూడు మెప్పుడున్.

—స్వరా-వ; 94-వ పద్యము.